

బి యస్ మూవీస్

# పచ్చని సంసారం

స్క్రీన్‌ప్లే దర్శకత్వం పి లక్ష్మీదీపక్ * నిర్మాత బి నారాయణ

లక్ష్మీ ఫిలింస్ రిలీజ్

LAKSHMI

ప్రతి ఇంటికి అవసరం



పేట్ పేన్



స్లైసర్

గంటకు 300 నుండి
400 వరకు పూరీలు
పూరీలు చేయవచ్చు

గంటకు 14000 నుండి
15000 వరకు పలచని
ముక్కలు తరగవచ్చు

ప్రతి ఒకటీ అవసరం ప్రతి ఇంటికి ప్రత్యేకమైన అల్యూమినియంతో చేయబడ్డాయి ఖరీదు చాలా తక్కువ తుప్పు పట్టదు వాడటం తేలిక కాలం పొదుపు అవుతుంది అన్ని పెద్ద దుకాణాలలో దొరుకుతాయి

తయారుచేయువారు

ఐ. ఏ. ఇండస్ట్రీస్

ఇండస్ట్రియల్ ఎస్టేట్, నవ్సారి (గుజరాత్) పోను 493

ADROIT/IB/1


రిటైల్ ధర రూ, 35 లు. టాక్సుతో సహా. హైదరాబాదు, సికిందరాబాదు. రాజమండ్రి, విజయవాడ, పాలఘాటు, గుంటూరు, సైలం, పొలాచి, ఏలూరులలో దొరకును.

# తొలిమాట

అగస్టులోనే శ్రీకృష్ణాష్టమి, 1963 లో కృష్ణాష్టమి సందర్భంలో అగస్టు జ్యోతిని ప్రత్యేక కృష్ణసంచికగా వెలువరించిన సంగతి కొందరు పాఠకులకి నా జ్ఞాపక ముండేఉంటుంది. ఈ సంవత్సరం అంత అవకాశం లేదు గనుక కీ. శే. జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు రాసిన ఒక కృష్ణకథను ఈ సంచికలో పునర్ముద్రిస్తున్నాం. (పే 11)

• • •

శిశుబుక్కుల ఘోషతో ఆంధ్రదేశంలో ఓ చిన్న గాలి దుమారం లేవదీస్తున్నాడు మహాకవి శ్రీ శ్రీ (పే 81)

• • •

శబ్దం తన్నాశ్రయించింది కనుక పట్టి బంధించిన మహాకవి శ్రీ శ్రీ ''పదబంధ ప్రహేళిక''తో పాఠకుల మెదడుకు మేత Supply చేస్తున్నారు. (పే 16)

• • •

దీపావళి ప్రత్యేక సంచికకు మరి రెండు Regular సంచికలు మాత్రమే గడువుంది. ఇదివరలో ప్రత్యేక సంచికలన్నిటితో మిమ్మల్నలరించినట్లు ఈ సారికూడా ఆనందింప చేయగలమని హామీ ఇస్తున్నాం.

# మెత్తని మృదువైన లేప్రాయపు ముఖవర్చస్సును ఇస్తుంది

## పాండ్స్ వానిషింగ్ క్రీమ్

ఆశ్చర్యమా? పాండ్స్ వానిషింగ్ క్రీమ్‌తో వుండే ప్రత్యేక హ్యూమెక్టెంట్ వల్ల మీ చర్మానికి సహజంగా వుండే తేమను వుంచడమే గాక దుమ్ము వాతావరణము నుండి కూడ రక్షిస్తుంది. సమంగా మ్యాట్ ఫినిష్‌కు పాండ్స్ వానిషింగ్ క్రీమ్ ఒకటే ప్రత్యేకంగా వాడవచ్చు లేక గంటల కొద్దీ మీ సింగారం చెక్కుచెదరకుండా వుండటానికి పౌడర్ పునాదిగా కూడా వుపయోగించవచ్చు.

4 సైజులలో లభ్యమయ్యే వానిషింగ్ క్రీమ్ అదొక్కటే— ఎకానమీ—లార్జ్—మీడియమ్—స్మాల్

PONDS

**పాండ్స్ వానిషింగ్ క్రీమ్-విశిష్టమైన పౌడర్ పునాది**

స్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు ఎస్ ఎ లో స్థాపితము)



సచిత్ర మాస పత్రిక

41, బి. బర్కిట్ రోడ్, టి. నగర్, మద్రాసు-17.

విడి ప్రతి వెల

1 రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 8

ఆగస్టు 1970

సంచిక 8

మేనేజింగ్ ఎడిటర్:

వి. వి. రాఘవయ్య.



ముఖచిత్రం

రామవిజేత వారి

'తల్లితండ్రులు' లో

జగ్గయ్య, సావిత్రి, శోభన్‌బాబు.

Edited and Published by V V Raghavaiah and Printed by K. Domodaram at Sri Kala-Printers, 83, Lake view Road, Madras-33.



# దీపావళి ప్రత్యేక సంచిక

## మెకానికల్ డాటా

| | |
|---|---|
| పేజ్ ఏరియా | 28× 21 సెం. మీ. |
| ప్రింట్ ఏరియా | 21×17.5 సెం, మీ, |
| ఆఫ్ పేజ్ | 10.5×17 5 సెం. మీ. |
| కాలమ్ సంఖ్య | 3 |
| కాలమ్ సైజు | 21× 5.5 సెం. మీ. |

## అడ్వర్టయిజ్‌మెంటు రేట్లు

| | |
|---|---|
| ఒపెనింగ్ పేజీ | రూ. 250-00 |
| లోపలి పేజీ | రూ. 200-00 |
| లోపలి సగం పేజీ | రూ. 110-00 |
| నాల్గవ కవరు పేజీ (మూడు రంగులు) | రూ. 600-00 |

బ్లాకులు, స్టీరియోలు అంగీకరింపబడును

వివరాలకు:

అడ్వర్టయిజ్‌మెంటు మేనేజర్

జ్యోతి

41. బి. బర్కిట్ రోడ్. టి. నగర్

మద్రాసు - 17.



# దీపావళి ప్రత్యేక సంచిక

దీపావళికి ముందుగానే అన్ని హంగులతో. అనేకానేక ఆకర్షణలతో అభిమాన రచయిత (త్రు)ల రచనలతో మామూలు సంచికకు రెట్టింపు సైజులో వెలువడుతుంది.

卐

ఆనవాయితీగా 'జ్యోతి'ని ఆదరించి అభిమానిస్తున్న పాఠకులకు, ప్రకటనదారులకు మా కృతజ్ఞతలు.

అదే విధంగా ఈ ప్రత్యేక సంచికను కూడా ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

卐

'జ్యోతి'

41, బి. బర్కెట్ రోడ్.

టి. నగర్. మద్రాసు - 17.

# మీకు తెలుసా?

5000 రూపాయలు 5 సంవత్సరాల వరకు

సోషల్ సెక్యూరిటీ డిపాజిట్ స్కీమ్.

క్రింద డిపాజిట్టు చేస్తే 5 సంవత్సరములు ప్రతి నెలా రూ. 27 లు ఇవ్వబడుతుంది. అదే మొత్తము 7 సం॥లు వరకూ డిపాట్టు చేస్తే 7 సం॥ల పాటు నెలకు రూ. 29 లు ఇవ్వబడుతుంది.

5000 రూపాయలు కాక

వివరాలకు 400 పైనున్న మా బ్రాంచీలలో ఏ బ్రాంచీనైనా సంప్రదించండి.

బ్యాంకింగు అవసరాలకు ప్రతి వారి బ్యాంకు.




## సిండికేట్ బ్యాంకు

(భారతప్రభుత్వం ఆధీనంలో వున్నది)

హెడ్ ఆఫీసు
మనిపాల్

కె. కె. పాయ్
కస్టోడియన్.




జూలై '70 జ్యోతిలో మీరు ప్రచురించిన కథల్లో' 'ఆశించని నాయకత్వం' కథ హైలైట్. ఆకల శిఖరాల బాగుంది. బొమ్మలు మాత్రం ఆకర్షణీయంగా ఉండటం లేదు.

చిన్న మనవి సినిమా శీర్షికకి పది పేజీలు వెచ్చిస్తున్నారు. బాగానే ఉంది. కానీ, మీరు ప్రచురించే వార్తలని మేము, మీ పత్రికకంటె ముందుగా వెలువడే కొన్ని వారపత్రికలలో, చదివినవే. కాబట్టి అనవసరంగా పదిపేజీలు వ్యర్థపరిచేబదులు మరో మంచి కథని ప్రచురిస్తే మంచిది—ఇది నా అభిప్రాయం

పోతే, ఈ సంచికలో 'అందరూ మారాలి' వ్యాసంలో, వ్యాసకర్త చేసిన సూచన బాగానే వుంది. కానీ దీన్ని ఆచరించే వారెంతమంది? ఆ సూచనని వ్యాసకర్తే తన వూళ్ళో మొదట ఆచరించకూడదూ?—ఇది జరగని పని. ఇబ్బర్లు చెప్పినంత సులువు కాదు చేయడం. ఇలాంటి 'సినిమా' వ్యాసాలు వేల సంఖ్యలో ప్రచురించినా మన పరిశ్రమ పాత దారినే పయనిస్తుంది గానీ కొత్త దారులు పట్టదు.-ఇది నిజం.

వచ్చేనెల నుంచైనా 'జ్యోతి'ని సకాలంలో అందచేయగలరని ఆశిస్తూ.

—ఎడిటర్ కం సినీగోయర్'

(బరంపురం, గంజాం)

అగస్టు సంచికకోసం చూసి చూసి కళ్ళు కాయలు కాచాయి. 1వ తేదికి వస్తుందనుకున్నాను. రాలేదు. ఇకపోతే జూలై సంచికలో వీనాదేవిగారి 'ఆవు-పులి' కథ సరదాగా వుంది. 'కనకామాలచ్మి కధలో నేటి సమాజంలోవున్న కుళ్ళును గురించి బాగా వ్రాశారు అదినిష్ణు సీరియల్ చాలా బాగు లేంది. త్వరలో పూర్తవుతుందే మోనని భయంగావుంది గాలిబ్ ఉత్తరాలు' బోర్ కొడుతున్నాయి. అజంతా అందం' అంతంగానేవుంది.

—ఇందిర, విజయవాడ

చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !

ఫలితములను చూడండి, బట్టలను ఆఖరు సారి జాడించునప్పుడు కొంచెము టినోపాల్ వేయండి, అప్పుడు చూడండి. బట్టలు ఎంత తెల్లగా, కళ్లు మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు, చీరలు, దుప్పట్లు, తువాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి! దానికయ్యే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్‌ను కొనండి. రెగ్యులర్ ప్యాక్, మితవ్యయ ప్యాక్ మరియు బాల్టీకి సరిపోయే పొట్లము — మూడు ప్యాకింగులలో లభిస్తోంది.







® టినోపాల్ జె.ఆర్. గైగీ ఎస్.ఎ. బాసెల్ స్విట్జర్లెండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగీ లిమిటెడ్
పి. ఒ. బాక్స్ 11050 బొంబాయి 20 బి ఆర్

Shilpi HPMA 12A/70 Te

# యశోద

యశోదా. నీకున్న పేరు ప్రఖ్యాతు లెవరికున్నాయి అదృష్టం అంటే నీదేనే. అంది ఒకావిడ. అనడానికేం, అనేవారు ఏదో ఒకటి అంటూనే వుంటారు.

నాదేముందమ్మా, అని అన్నాను. ఏదో నమ్రత కోసం అల్లాగ అన్నాననుకుంటారు. కాదు నిజం.

నాదేముంది నిజానికి. ఏదన్నా గౌరవము అంటూ వస్తే అది మా అబ్బాయి వల్ల వచ్చింది. అంతే.

అదుగో, నోరు జారింది మళ్ళీ. మా అబ్బాయి అనకూడదట. ఆ లోకేశ్వరుణ్ణి అనుకున్నా ఎన్నిసార్లో నోరు జారుతూంటుంది.

నేనైన చెప్పుకోకూడదనుగానీ, సర్వేశ్వరుడూ అబ్బాయి ఏమిటి! మొట్ట మొదటిసారి కన్నుల పండుగ అయినప్పటినుంచీ అతను ఏదో వేలుపుగా కనిపిస్తాడు కాని, మామూలు బిడ్డడుగా తోచడు.

ఆడపిల్ల. ఆడపిల్ల ... యశోదకు ఆడపిల్ల అన్నారు అందరూ. నవ్వులాటకే అన్నారో, నిజంగానే అన్నారో కూడా తెలీదు నాకు. సొమ్మసిల్లి పడుకున్నాను మళ్ళీ. తెలివి వచ్చి చూద్దునుగదా పక్కలో, పొత్తికళ్ళలో ఉన్నాడు కన్నతండ్రి.

కళ్ళు తెరుచుకుని చూస్తున్నాడు. అనగా ప్రేమగా, భక్తిగా పాప కళ్ళలోకి చూద్దునుగదా, అవి కళ్ళా! అచ్చే సూర్యచంద్రులు ఒక్కసారిగా వికసించిన సూర్యచంద్రులు, ఇరుగమ్మలూ వచ్చారు. పొరుగమ్మలూ వచ్చారు. అంగరక్షలు వేశారు. జోజోలు పాడారు. కలకలలాడుతూ నవ్వుముఖాలతో అమ్మలక్కలు ఎవరి దారిన వారు వెళ్లారు.

నాయన తొట్టిలో నిద్రించేవాడు. బ్రహ్మాండం అంతా తన ఉయ్యాలతొట్టి చేసుకున్నవాడు-మా యింట ప్రేపల్లెలో ఒక అయ్య యింట, ఒక అమ్మగుండెలో చిన్న ఉయ్యాలతొట్టిలో నిద్రిస్తున్నాడు అని అప్పుడు మాకు తెలియదు.

కీ॥ శే॥ జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి

ఎక్కణ్ణుంచి వచ్చిందో, చుప్పనాతిది, పూతనట రాక్షసి వచ్చింది. బాలుణ్ని చూసింది. నవ్వింది. ముద్దాడింది. ఎత్తుకొంది. అసలు నేను పాపను ఎవరి చేతికీ ఇవ్వను. ఎత్తుకోడం తెలీక ఏం చేస్తారో అని.

వద్దమ్మా అని అంటూనే వున్నాను. ఎత్తుకొంది. పాలు ఇస్తా అంటుంది. చెబితే వినదు. ఇంటికొచ్చినవారిని ఏం అంటే తప్పో అని, దైవం మీద భారం వేసుకుని చూస్తున్నాను. కన్నయ్య పాలు తాగడు. పాలే-దాని ప్రాణాలే త్రాగేశాడు. ఉఁ హుఁ హూఁ...అంది వొణికింది. గింజుకుంది. గిలగిలలాడింది. కళ్ళు తేలేసింది దాని వికృతాకారం చూశాక అసలు తెలిసింది, అదో దుర్బుద్ధురాలని అనీ, చంపబోయి చచ్చింది అనీను వ్రేపల్లె అంతా గుప్పుమంది. ఎక్కడెక్కడివారూ వచ్చారు చూశారు ఎవరు వస్తేనేం, ఏమంటేనేం. నాన్న తన లోకంలో తానున్నట్లుగా ఉయ్యాల తొట్టిలో కట్టిన గిలక్కాయను చూస్తూ తనకేం పట్టనట్లు పడున్నాడు, పొద్దుట్నుంచీ అంతే వాడి పని. చేసేది చేస్తాడు. ఏమీ ఎరగనట్టుంటాడు. ఏమిటిరా నాన్నా అంటే - నంగనాచి— నాకేం తెలీదమ్మా అంటాడు. ఏం అంటాం. అల్లాంటి వాళ్ళను.

మరోనాడు—

ఏదో, పండగో పబ్బమో వచ్చింది. ఊరెల్లా నోములూ, పూజలూను. ప్రతి వారికీ చేతినిండా పని. ఎక్కణ్ణుంచి వచ్చిందో...ఒక బండి దాన్నిండా ఏవేవో వస్తువులు తొట్టె దగ్గరికి వచ్చింది కిష్టయ్య కాలు సాగదీసి—అంత బండినీ ఒక్క తన్ను తన్నాడు. బాలుడెక్కడ? బండి ఎక్కడ? అంతబండీ-ఫెళ ఫెళ విరుచుకుని పడింది. బండినిండా వున్న వస్తువులు మట్టిపాలైనయ్. అవి విషం వస్తువులట. మనకేం తెలుస్తయ్. మహా యోగులకు, మాగీశ్వరుడికీ తెలియాలి గాని అందుకే—ఒక్క తన్నుతో నేల పాలు చేశాడు స్వామి.

చల్లని వెన్నెల. ఆరుబయట మంచాలు వేసుకున్నాం. సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నాం. మంచం మీద వెల్లకిత్తలా పడుండి చూస్తున్నాడు కన్నయ్య. ఎక్కణ్ణుంచి వచ్చిందో సుడిగాలి. రావడం ఏమిటి! గిర్రున పసివాణ్ని ఎత్తుకొని పైకి పోవడం ఏమిటి? అందరం చూస్తూనే వున్నాం. ఏం చేస్తాం? కృష్ణా, కృష్ణా అంటూ అలగోలు బాలగోలుగా వున్నాం. అతివిపత్తి వచ్చినప్పుడేం గతి!

అంతలో మిన్ను విరిగి పడ్డట్టు అయింది. దయ్యం మహామహా వాడూ వీడూ రాక్షసుడేట— నేల పడ్డాడు. కిష్టయ్య నవ్వు మొహంతో మంచం మీద చేరాడు. తామరపువ్వు రెక్క, సంపెంగ పువ్వు మొగ్గ నలగలేదు. అలత లేదు. కలత లేదు. కిలకిలలాడుతున్నాడు.

ఇక చూడండి. ప్రతివాడూ మా యింటికి అంటే మా యింటికి అంటూ పిలుచుకెళ్ళేవారే ముద్దు చేసేవారే.

పర్యసనము—ఒక యింట్లో దిగుతాడా! వ్రేపల్లె అంతా వాడి యిష్టారాజ్యం అయింది. అంతే కాదూ!

బాలుడు పొద్దున్నే మేల్కొలుపులు పాడాలి. కళ్ళు విప్పడు ఓ పట్టాన. ఎక్కడలేని మారాం చేస్తాడు. దొంగనిద్ర పోతాడు. ముఖానికి చేయి అడ్డం పెట్టుకుని—వేళ్ళ సందుల్లోంచి చూస్తాడు. ఊఁ-ఆడింది ఆట పాడింది పాట.

వెన్నంటే అమితమైన యిష్టం కవ్వం మొనట్లో మజ్జిగ గాగాని సహించదు. ఈ వెన్న నానా రొష్టూ పెట్టింది. వాయ గా మనకేం పాడి తక్కువా, వెన్నకు యింత లోటా? అని ఎంతో చెప్పి చూశాను.

చిలకల్లే వింటాడు. ఊరు ఊరంతా ఓ కొలిక్కి తెచ్చాడుగద. ఏడి! తోడు రోహిణి కొడుకు రాముడూ కలిశాడు. ఇంక పట్ట పగ్గాలేమున్నాయ్!

గోపికలు రావడం-మీ అబ్బాయి యిట్లా చేశాడు, మీ అబ్బాయి యిట్లా చేశాడు అనడం యిదో మేళం.

వాళ్ళకు తెలియాలి గాని, మా అబ్బాయి దేవుడర్రా మీ యింట్లో వాడు అల్లరి చేయటం మీ అదృష్టమర్రా... అని మనం చెప్తామా! చబితే బాగుంటుందా? ఎన్ని చెప్పినా వింటారా! ఒకరా యిద్దరా? గుంపులుగా గోపెమ్మలు రావడం—యశోదా, చూడు—వీడేం చేశాడో, యశోదా చూడు ఏం ఏం చేశాడో మీ అబ్బాయి అనడం ఇదేమన్నా చాటు మాటా! వాళ్లు అల్లా గగ్గోలుగా చెప్తుంటే నా చీరకుచ్చెళ్లు పట్టుకుని వాడు అక్కడే వుంటాడాయె. నాన్నా నిజమేట్రా? అని అంటే—నాకేం తెలీదమ్మా అంటాడు. నాతండ్రి అబద్ధం ఆడడు. బాబూ యింకెప్పుడూ అల్లా చెయ్యకమ్మా అంటే, వుత్తదమ్మా పోనీ నేనేం చేశానో వాళ్లనే చెప్పమను అంటాడు. వాళ్లా చెప్పరు. వీడా ఏం ఎరగనంటాడు. ఏం దారి! మా కోడల్ని యిట్లాగన్నాడు. మా అమ్మాయిని యిట్లాగన్నాడు అన్నారు చివరికి నేను నిగ్గదీసి అడిగితే.

పోండి. పసివాడికి పాపాలు అంట గడ్తున్నారు అన్నాను. వెళ్ళారు. వెళ్ళకేమి చేస్తారు! నిజమైతేగా...నిష్ఠూరం చెయ్యడానికి.

* * *

ఛీ, ఛీ, మన్ను తింటారా ఎవరన్నా అంటూ కసురుకున్నాను, నిజమే. ఇప్పుడనుకుని ఏం లాభం! అన్నానమ్మా, అన్నాను. ఊరికే అనడం కాదు. దండిం చేశ్లే అన్నాను.

ఉత్తదమ్మా...అన్నాడు నవ్వుతూ.

వాడు నవ్వినప్పుడల్లా, నా కోసం ఎగిరి చక్కా పోతుంది. నటశేఖరుడు మరి. దొంగ నవ్వులు నవ్వేవాడు. ఆ నవ్వు వొక్కటి చాలు. కోటి జన్మలు సార్థకం అయినట్టై అనిపించడానికి. అట్లాగే దొంగనవ్వు నవ్వాడు అనుకుని చిట్టిదెబ్బ యిట్టే వేశాను.

అమ్మా-నేనెందుకు మన్ను తింటా నమ్మా అంటూ నోరు తెరిచాడు. మన్నెం దుకు వుంటుందీ ఆ నోట్లో.

మన్ను, మన్ను. నా మాటే మన్ను. ఆ నోట్లో—విరాట్ స్వరూపం వుంది విశ్వేశ్వరుడి నోట్లో విశ్వం విశ్వమే వుంది. నన్ను నేనే నమ్మలేకపోయాను. నేను యశోదనేనా? కళ్ళు చెదిరిపోయాయి నాకు. చప్పున తెలివి వచ్చింది. కృష్ణా, జగం ప్రభూ! నిన్ను కనిపెంచడమూ నా అదృష్టము. నీ ముద్దు మురిపాలు చూడడం నా జన్మకు సాఫల్యం. నీ అంద చందాలు నీ హొయలు, నీ లీలలు కళ్ళారా చూడడం, కొన వేల జన్మల తపస్సుకు ఫలితం. నాన్నా నన్ను మన్నించు. ఈ లీలలు చాలించు. చూడలేను అన్నాను. చేతులు జోడించాను. పాదాలు ముద్దెట్టుకున్నాను. కూలబడ్డాను. బాబు ఎగిరి నా వొళ్లోకి దూకాడు.

ఓః...

నిజమే నాదే అదృష్టం.

ఏం అదృష్టం, సర్వేశ్వరుడు కుమారుడు కావడం ఎంత ఇదో చప్పు చప్పున తెలిసి వచ్చింది.

నాన్నను మాట అనలేను. ఎవరన్నా అంటుంటే సహించలేను. నాకిదో వెర్రి అనుకునేవారూ వున్నారు. అనుకున్నారు కూడా.

ఎవరో కొద్దిమంది. లేక లేక కలిగిన సంతానమమ్మా యశోదకు. ఆ కొడుకు ఏం చేసినా చూస్తూ వుంటుంది అనే వారు.

వాళ్ళకేం తెలుసూ! పిచ్చివాళ్లు. నా బిడ్డ దేవుడు.

పువ్వును చూడచ్చు. చూడకపోవచ్చు పరిమళాన్ని చూడకపోవడం ఎవరితరం!

కొండ ఎత్తాడు నా బిడ్డ. ఊరు ఊరంతా దణ్ణాలు పెట్టారేమరి! దేవతలకు దేవతలే దాసోహం అన్నారే మరి.

నాన్నా, ఈ దుడుకు పనులు మానుదూ, అన్నాను. నటశేఖరుడు నవ్వాడు.

లాలనగా, బుజ్జగిస్తూ- నా కోసం నా కోసం యీ దుడుకు పనులు అంటున్నాను.

చప్పున నా నోరు మూసినట్లు, నన్ను ముద్దు పెట్టుకుని మరీ అన్నాడు-అమ్మా నా మీద బెంగ పెట్టుకోకు. అంతగా అయితే నీకు ముందు చెప్తాలే అని.

ఇదేం వరం. ఇవాళ ఈ అఘాయిత్యము చేస్తా అని ముందే చెప్తాట్ట. అమ్మో, నా గుండెలు ఆగుతాయా! నేనేమై పోవాలి!?

ఏదీ మహానుభావులకు తల్లులైనవారు పడే కష్టం.

కాళింది మడుగు కథ ఎవరెరుగరు? ఆ చాయలకు ఏ ప్రాణైనా పోయిందా? అలా వెళ్ళి ఎవరయినా బతికి బయట పడ్డాడా? అమ్మా . కాళింది మడుగుకు వెళ్తున్నా అన్నాడు. వొద్దు వొద్దు అన్నా వింటాడా? ఒద్దు అని అపశకునం మాట నేను అనగలనా? అల్లాగని ఛీ పోయిరా నాయనా అనీ అనగలనా?

కృష్ణా, నాకు యిదేం పరీక్ష?... అని కళ్ళ నీరు ఒత్తుకొన్నాను.

అమ్మా, పోనీ నవ్వరా అన్నాడు ఆ దీమా ఏ బిడ్డకు వుంటుంది. వెళ్ళాడు.

ఊరు వూరంతా, ప్రేపల్లె ప్రేపల్లె అంతా అక్కడే వుంది. ఏమయింది? అతి సుకుమారమయిన ఆ పాదాలు, తామర రేకులవంటి పాదాలు, సుతిమెత్తని మోగుల మనస్సులలో చిందులొక్కే నా బిడ్డ పాదాలు కాళియుడి తలపై నాట్యమాడినావి. ఆశ్చర్యపోయాను. నాన్నా. అన్నింతపనీ చేశావుగద అనుకున్నాను.

నా బిడ్డ నటసార్వభౌముడు నాకేసి చూసి నవ్వాడు. ఆ(. ఆ నవ్వులో—ఎన్ని జన్మలయినా ఎత్తుతాను. ఎంత తపస్సు అయినా చేస్తాను.

పిల్లనగ్రోవిని ఎవరెరుగరు? గోపాల కృష్ణుడు. వేణుగోపాలకృష్ణుడు అయ్యాడు. గోపాలకృష్ణుడి మురళీనాదం—మురళీనాదమా? ఆ వేణునాదం వేద నాదం కదా.

పెద్దవాడయ్యాడు. బృందావనం పులకించింది. మీ అబ్బాయి చూడమ్మా. చెప్పరాని పనులు చేస్తున్నాడన్నారు. కల్లబొల్లి చాడీలు చెప్పారు. వారి మాటకే దీవనలైనవి వెన్నెలరాత్రులు, బృందావనం — కలకాదు, కల్లకాదు. కళ్ళారా చూడండర్రా అని సర్వమయుడు లీల నడిపాడు.

ఆ వెన్నెల రాత్రులు నాకు తెలుసు. ఆ లీలలు నాకు తెలుసు. ఆ వేణునాదం, నాయక సార్వభౌముడు గోపాలకృష్ణుడి మురళీనాదం నాకు తెలుసు నా హృదయానికే తెలుసు. నేనింక వందజన్మలు, వేనవేలజన్మలు ఎత్తనీ—ఈ నా బిడ్డ—మళ్ళీ అంటున్నాను. అనకూడదు అని తెలిసికూడా అంటున్నాను. నా బిడ్డ మహాజ్ఞాని. భగవంతుడు. సర్వేశ్వరుడు. నా బాలకృష్ణుని మురళీనాదం. నా తనువు నిండుతుంది. నా హృదయం నిండుతుంది. అదే నన్ను బతికిస్తుంది. కృష్ణా, జగద్రక్షకా అని చేతులు జోడించడం తప్ప నా హృదయం సమర్పించడం తప్ప—నా కేముంది? నాకేం పేరు ప్రఖ్యాతులు వద్దు. కృష్ణుడు నా బిడ్డడు అనీ తప్ప.—చాలు.

*

## పదబంధ ప్రహేళిక

రచన : శ్రీశ్రీ

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | ■ | 3 | 4 | | ■ | 5 | 6 |
| 7 | | | ■ | | ■ | 8 | | |
| ■ | | ■ | 9 | | | ■ | | ■ |
| 10 | ■ | 11 | ■ | | ■ | 12 | ■ | 13 |
| 14 | | | | | | | | |
| | ■ | | ■ | | ■ | | ■ | |
| ■ | 15 | ■ | 16 | | | ■ | 17 | ■ |
| 18 | | | ■ | | ■ | 19 | | 20 |
| 21 | | ■ | 22 | | | ■ | 23 | |

### అడ్డు

1 నా వశంలో ఏముంది? ప్రారంభంలో పడవ
3 ఇనుప సరుకులో మూలికారసం.
5. అరణ్యం కాబట్టి
7. భూమిని చీల్చేది బలరాముడు తాల్చేది
8 12, 13 సూచనలకి ఉదాహరణ.
9 కచట తపల తలకామని తాడు మధ్య పెడితే స్పృశించాడు.
13 డబ్బు ముఖ్య మంత్రిది. మరి ముఖ్య మంత్రి పదవి ఎవరిది?
16 బహుశా ఆంధ్రదేశంలో 5 కోట్లు.
18 అనే కానేక పాలు,
19. ఎటు చూసినా యాక్టింగే
21 ఆట విడుపులో పట్టువదలు.
22. మలక కొమ్ముల వాడితూపు.
23, ఉన్న వాళ్ళు మరీ తిని బలిసి పోవడంతో ఒక పద్ధతి లేకపోలేదు

### నిలువు

1. అక్షరం రెండుసార్లు అర్థం అనేకం
2 గరువమారిన రుచి ఆరింటిలో ఒకటి.
4. సహృదయ కవనానందులు దిగంబర భక్తులు కాగలరు
5, A ‾ of murders అన్నాడు ఛార్లీ ఛాప్లిన్.
6 పిల్లి లేని పినతల్లి.
10 సహాయసం ఉంటరి?
11 ఎమ్ తో సృష్టికర్త-ఇక తిట్టు,
12 తినగా తినగా రెండూ తియ్యనుండు
13 కందం రానివాడే కవి...చంపిన బంటు
15 1969.
17. ఈ టిక్కెట్లు ఎన్నో లక్షలు
18. ఇక విషయంలో శుక్రుడు.
20. అతినవ్య ధోరణిలో తిరగబడ్డ నమస్కారం.

**సొల్యూషన్ వచ్చే నెలలో. ఆగస్టు 20 వ తేదీలోగా ఆల్ కరెక్ట్ సొల్యూషన్ పంపిన వారి పేర్లు పై సంచికలో ప్రకటిస్తాం. వాడుకలో ఉన్న ఒకటి రెండు ఇంగ్లీషు మాటలు కూడా పజిల్ లో ఉన్నాయి.**

# అపర కపి

ముదిగొండ శివప్రసాద్
M.A. Litt (PhD)

రైలు ఈడ్చుకుంటూ తెనాలి స్టేషను నుండి బయలుదేరింది. అసలే ఎండా కాలం. దానికి తోడు పాసెంజరుబండి ప్రయాణీకులు విపరీతమైన ఉక్కతో వడతో సతమతమైపోతూ వున్నారు. సరిగ్గా రైలు ప్లాటుఫారంమీదనుండి కదిలే సమయానికి ఓ పెద్దమనిషి తనకంటే పెద్దదైన ఓ బెడ్డింగుతో తోసుకుంటూ ఆ ఎండలో పెట్టెలోకి దూసుకువచ్చాడు. వస్తూ వస్తూనే బారిష్టరు పార్వతీశంగారు ఎదురుగా వున్న ఓ గుండు వ్యక్తిపైకి బెడ్డింగు విసిరేశాడు. ఆయనెవరో తిరుపతి పోయివస్తున్నాడల్లే వుంది. నున్నగా గుండు ఫౌన్నాయల్లే వుంది. అసలే బరువైన బెడ్డింగు అందులోనూ ఎండలో నుండి వచ్చింది. అకస్మాత్తుగా నెత్తిన పడేసరికి బాధ భరించలేక ఓ మోస్తరు ఏడుపే లంకించుకున్నాడు - అప్పుడే రైలెక్కిన మన బారిష్టరు పార్వతీశం మోచేత్తో అవతలి సీటులోని వ్యక్తిని ఒక్క పోటు పొడిచాడు. ఆయన విలవిలా తన్నుకుంటూ జరిగాడు పక్కకు. పార్వతీశం ఆ ఖాళీ నాక్రమించి ఓ చిన్న నకిలింపువంటి ఘుర్ఘుర ధ్వని చేసి నాలుగువైపులా కలియచూచాడు. కొంత మంది విబ్బెరపోయారు ఆయన సాహసానికి. మరికొందరు కోపంతో చూస్తున్నారీ చేష్టలను. పార్వతీశం అటూ ఇటూ చూచి సీటును మరికొంచెం గట్టిగా స్థిరపరచుకొని నిర్లక్ష్యంగా ఓసారి రైలు పెట్టెనంతా పరిశీలించి, ఒక్కసారి పెద్ద కేక పెట్టినట్లున్నాడు 'బొత్తిగా మన తెలుగువాళ్ళ కసలు బుద్ధే లేదండీ!'

అయితే ఆ ఎండలో, వడలో, సందడిలో త్రొక్కిసలాటలో ఆ మూడో తరగతి రైలుపెట్టెలో తెలుగువాడికి బుద్ధి ఉన్నదా లేదా, లేకుంటే ఎందుకని లేదు! అన్న విషయాన్ని గురించి విచారింపడం అటువంటి కనీసం ఏదీ ఓపిక కూడా ఎవ్వరికీ లేదు అందుకని ఈ పార్వతీశం ఏమంటున్నాడన్న మాట కనీసం ఆయన పక్కన కూర్చున్న వ్యక్తి గూడా పట్టించుకోలేదు. అయితే ఆయన అంతటితో ఊరుకోలేదు. తన మాట నిరూపించుకునేటందుకు వ్యాఖ్యానంగా ఉపన్యాసం ప్రారంభించారు 'అసలు బుద్ధి వున్నవాళ్ళయితే ఇలా ఒకే రైలుపెట్టెలో ఇంతమంది ఎక్కుతారా? అక్షరాలా ఇది

తెలుగు రైలు. రేణిగుంటనుండి విజయవాడదాకా పోతుంది - దీనిలో ఈ రష్షేమిటి? ఎవరన్నా ఫారినర్ కనుక చూస్తే నవ్విపోతాడు — ఇది రైలా? అసలిది రైలేనా అని నేను అడుగుతున్నాను... ఆ రైలవునో కాదో చెప్పే ఓపిక లేక పాపం జెర్సు అలా సొమ్మసిల్లి వున్నారు గాలికి - కానీ పార్వతీశం అంతటితోనూ ఊరుకోలేదు. ఏ పల్లీ చదువా అమ్మేవాడికి వల్లేనో లేచి నిలబడి కంఠాన్ని కంచులా మోగించి ఉపన్యాసం పొడిగించాడు.

'తెలుగువాడికి బుద్ధిచెప్పడానికి మరి కొన్ని సంగతులు కూడా చెపుతాను చిత్తగించండి - తెలుగువాడికి తెలుగు వాడంటే పడదు. ఖర్మగాలి ఎవరైనా ఒక తెలుగువాడు పైకొస్తున్నాడంటే వాడి కాలు పట్టి లాగి కింద పడేసేవరకూ విశ్రమించడు. రెండవవాడు తాను పైకి పోవడం కాదు తెలుగువాడికి ముఖ్యం. తోటి తెలుగువాడు పోకుండా చూడటం - తెలుగువాడికి తెలుగు వాతావరణం గిట్టదు - బెంగాలీ పంచకట్టు కావాలి, నిజాం షేర్వాణీ కావాలి, మద్రాసు తలపాగా కావాలి హిందీ కవిత్వం కావాలి - చివరకు పిల్లల్ని చదివించేందుకు ఇంగ్లీషు కాన్వెంటు కావాలి-అందాల తెలుగు-అనందాల తెలుగు నా వీరభాష తెలుగు, నా తేనెల భాష తెలుగు ఎవ్వడికీ అక్కర్లేదు....అసలే అక్కర్లేదు...ఏమిటీ బుద్ధిహీనత ఎందుకీ నాన్సెన్స్ - అసలేమిటీ అంట' పార్వతీశం రాజకీయ నాయకుడిలా మాంచి ఆవేశంగా ఉపన్యాసధోరణిలో పడి తన్ను తాను మరచిపోయాడు.

ఇంత హడావుడి జరిగేసరికి బండిలోని అన్ని జతల కళ్ళూ కొంతవరకు పార్వతీశంపైపు ప్రసరించాయి. కొందరు వింతగానూ మరికొందరు వినోదంగానూ చూస్తున్నారు....పార్వతీశం ఇంకా అలాగే ప్రసంగాన్ని సాగించారు. 'నా మటుకు నేను కొన్ని వందల సంఘటనలతో ఉదహరించగలను ఈ విషయాన్ని బలపరిచేందుకు అసలు నా జీవిత చరిత్రలో వాటి నన్నింటినీ వ్రాస్తున్నాననుకో - అది వేరే సంగతి. ఒకసారి నేను ఆగ్రా పోయినాను ఆగ్రా - ఏదీ తాజమహల్ వుండే ఆ ఆగ్రా. అక్కడ పూర్ణిమ పండువెన్నెల రాత్రిలో కూర్చున్నాను. నా చుట్టూ నాలుగైదు భాషల మనుషులు - ఆ వాతావరణం నా మనసులో మల్లెలపందిరి వేయించింది - హృదయం పులకరించింది 'అలా జనా పొంగ' అని మనుచరిత్రలోని పద్యం రాగయుక్తంగా ప్రారంభించాను

'అయ్యా! ఇది మను చరిత్రలోది' రైల్లో ఓ మూలనుంచీ కేక—

'గుడ్డు కదూ...' పార్వతీశానికి కోపం వచ్చి అన్నాడు.

'గుడ్డు కాదండీ - పిల్లే' అంతా నవ్వారు.

వాతావరణం ఇలా నవ్వులపాలు కావడం ఆయనకు నచ్చలేదు - 'చాల్లే వయ్యా - మహా విద్వాంసుడివి బయలుదేరావు. ఏదో ఒకటి మనువో వనువో -



ఏం మునిగిపోయింది ఈ గొంతెంతో.... చూశారా - ఇదీ అంతైన తెలుగువారి తెగులు - ఇదే పరాయిభాషవాడయితే ఆ తప్పొప్పులకు సున్నం పూసి పాలిష్ చేసి పాస్ చేసి తమ భాష గొప్పతనం చెప్పుకుంటాము. కాని మనవాళ్ళో... అంతా రంధ్రాన్వేషణ...'

'ఆ ఎవరికి కావాలండీ కాలక్షేపం బటానీలు ఎవరికి కావాలి!' పక్క పెట్టెలో నుండీ బటానీల బుట్ట ప్రవేశించాడొకాయన ఈ పెట్టెలోకి. అతని కంఠ ధ్వని ముందు పార్వతీశం కంఠం వినపడలేదు. అందు కని గత్యంతరం లేక కొంతసేపు విరమించాము ప్రసంగం బటానీ బుట్టతో [illegible] స్టూడెంట్ [illegible] [illegible]ముషాల్లో [illegible] [illegible] సా [illegible]మే ఆలస్యం పార్వతీశం [illegible]ంకించుకున్నాడు.

'[illegible]కే నా కవిత [illegible]ంతేనే బొత్తిగా నచ్చలేదు - ఏ ఫాంనో పోయి హాయిగా బతకాలనుకుంటున్నాను'

ఫో - ఇప్పుడే ఫో పీడ అన్నా డెవరో అవతలి కిటికీ వద్దనుంచి...

'ఏమిటీ సోది, ఎవడడిగాడు ఈయన్ను ప్రసంగించమని' అన్నట్లు ముఖం పెట్టారు చాలామంది చీకాకుతో.

'అంతే కాదు మిత్రులారా! వినండి ఇకనుండి నేను తెలుగు భాషలో రచనలు చేయడం కూడా మానివేస్తాను.' కతో్ర

మైన తన అభినవ గుణాఢ్య ప్రతిజ్ఞ వదిలి కాడు పార్వతీశం తెలుగు వాళ్ళమీది కోపంతో... దీనితో పక్కాయనకు ఆసక్తి పెరిగి అడిగాడు - 'అయ్యా-తమ నామ ధేయం ఏమన్నారు...'

'వల్లభకవి' మన పార్వతీశం - ఇక నుండి వల్లభకవే అందాం - ఖంగుమని సమాధానమిచ్చాడు. 'వల్లభకవి' అన్న ఆయిదక్షరాలూ రైలుపెట్టె నొక్కసారి మంత్రముగ్ధం చేసివేశాయి...కంపార్టుమెంటు మొత్తం ఒక్కసారి పునాదులతో కదిలినట్టయింది - 'వల్లభకవి' 'వల్లభకవి' మహాకవి వల్లభకవి వీరా?' ప్రముఖ ప్రజాకవి. సుప్రసిద్ధ నవలారచయిత ఉత్కృష్ట వాగ్గేయకారుడు - వేలాది ప్రజల ఆరాధ్యదైవం వల్లభకవి వీరేనా? ఓహో ఎంత ధన్యులమయ్యాము - వారెక్కిన పెట్టెలో ఎక్కి ప్రయాణం చేయడంతో ఎంత అదృష్టం లభించింది మనకు.. ఇలా వెల్లువలాగ రైలుపెట్టెలో ఆలోచనలు పొర్లిపొంగాయి...

'స్వామీ.తమరేనా వల్లభకవీంద్రులు... ఓహోహో' పక్కనే కూర్చున్న పెద్ద మనిషి సాష్టాంగ నమస్కారం చేశాడు కవికి.

వల్లభకవి చిరునవ్వు నవ్వాడు...

'అసలా చమత్కార భరితమైన సహజ మృదుమధుర గంభీర సంభాషణా క్రమం చూచి నేను అప్పుడే అను కున్నాను - ఈయనెవరో మహామహులై వుంటారని. అనుకున్నట్టే అయింది - మా అదృష్టం పండింది' మరో భక్తుడు తన అభిమాన కవికి కైవారం సమర్పించాడు.

'అపర వాణీదవులు తమరు' ఒకరి నుండి.

'పుంభావ సరస్వతులు' మరొకరి స్తుతి.

'అపర కవులు అపర కవులు' ఓ అజ్ఞాని ప్రేలాపన.

'ఛత్ నోరుముయ్యి. అపర సరస్వతి అనాలి.'

మరో మిత్రుని సవరణ....

రైలు పెట్టె మొత్తమూ సంరంభంతో సంతోషంతో నిండిపోయింది. ఎటు చూచినా స్వాగత వాక్యాలే— సమ్మాన ప్రసంగాలే—నవ్వుల వెల్లువలే—నర్మ గర్భ సంభాషణలే— వీటన్నింటికీ వల్లభకవి హృదయపూర్వకంగా సంతోషించినట్లుగా అతని ముఖాన్ని బట్టే తేలికగా పోల్చుకోవచ్చు- పెట్టెలోని ప్రజలు అప్పటి వరకూ తన యెడల చేసిన అవజ్ఞను క్షమించానన్నట్లు దయార్ద్ర దృష్టి ప్రసరించాడు వల్లభకవి-

'స్వామీ తమరు సామాన్య విలాస్‌ థర్డు క్లాసులో ప్రయాణం చేయడమే మా అదృష్టం'

'ఏదేమిటయ్యా—నేనుగాంధేయవాది ని. నేను తెలుసు కదా ప్రజాకవి ప్రజల నుండే పుట్టాడు—ప్రజలలోనే జీవిస్తాడు. ప్రజలలోనే చస్తాడు—

'అహాహా' కరతాళ ధ్వనులతో నిండి పోయింది పెట్టె 'స్వామీ మీ కంటి గుర్రం రచనలో జానకి పాత్ర నెందు




ఇంత క్రూరంగా చిత్రించారు?'

'అది దాని ఖర్మం—ఆ జాతకి క్రూరాత్మురాలు. భగవంతు డామె నలా సృష్టించాడు. అందుకు మనమేం చేస్తాము?'

'ఆ పాత్ర నలా అర్థాంతరంగా వది లేశారే చివరికది ఏమవుతూందని మీ ఉద్దేశం—'

'ఆ-ఏ 'బ్లోనో' దూకి చస్తుంది.' నిర్లక్ష్యంగా సమాధానం చెప్పాడు వల్లభ కవి —

ఆయన నలాంటి ప్రశ్నలతో బాధించ కూడదని మరొకరు ఆ పృచ్ఛకుణ్ణి మంద లించారు—అంతలో ఓ చిన్న స్టేషను వచ్చింది. బండి ఓ నిముషమాగి మళ్ళీ బయలుదేరింది.

మహాకవీ - మీ ప్రస్తుత కార్యక్రమ మేమిటి? ఆసక్తితో ప్రశ్నించా రొకరు.

'ఆఁ - ఆ విషయానికే వస్తున్నాను వల్లభకవి అందరి పముఖాలూ ఒక్కసారి కరికించారు—

కంపార్టుమెంటు మొత్తమూ తన వైపే చూస్తున్నది.

ముసలితాత ఒకాయన కళ్ళజోడు ముక్కు మీదికి లాగి ఆప్యాయంగా చూస్తున్నాడు తన్ను. ఓ యువకుడు ఆటోగ్రాఫు పుస్తకం చేతులో పట్టుకుని రడీగా వున్నాడు తన కొరకు ఒక చిన్న గడ్డం పెద్ద మనిషి చేతిలో మ్యాస్ పేపర్ పక్కకు నెట్టి పైన పడుకున్నవాడు

కిందికి తొంగి చూస్తున్నాడు తన వైపే ఆసక్తిగా.. పెట్టెలోని ఆడవాళ్ళంతా తన్నే చూస్తున్నారు. మగవాళ్ళంతా తన్నే చూస్తున్నారు. అంతా తన్నే చూస్తున్నారు....

'నేనొక బృహత్తర సంకలనం ప్రచురింప బోతున్నాను.'

ఆటంబాంబు వదిలినట్లు రైలుపెట్టెలో తన అపూర్వ కార్యక్రమాన్ని ప్రచురించాడు వల్లభ కవి.

'సంకలన మంటే సంకలనం కాదు. అపూర్వ సంకలనం. కట్టాపద్దు పుస్తకాల్లా చిత్తు కాగితాల్లో చెత్తకాగితాల్లో ముద్రించి అమ్మరు దాన్ని. మేలిమి కాగితంపై ఏడూం పెస్టరులో నో ముద్రిస్తారు...'

'తెలుగులో నేనా?' ఒక సంశయాత్ముని ప్రశ్న.

'ఉష్ - ష్ - మాట్లాడరాదు. వాడు చెప్పేది చిత్తగించు' పక్కవాని సర్దుబాటు—

'తెలుగులో ఉత్తమ పుస్తకాలు నశించాయి. సాహిత్య స్థాయి పతనమై పోయింది. మనిషికో గ్రంథాలయం పెరుగుతున్నమాట నిజమే కాని లైబ్రరీల పొడవూ వెడల్పూ ఎటూ పెరిగాయి కాని లోతు మాత్రం లేదు..

('గుంట తవ్వితే సరి' అని ఓ గుంట పొసైడ్ కమెంట్ చిన్నగా)

అందుకనే నా లోకోత్తమ సాహిత్యాన్ని అందరికీ అందుబాటులోకి తీసుకు రావాలని ప్రయత్నం ఒకటి ప్రారంభించాను—దానికి మీరంతా హృదయపూర్వకంగా ఉదారంగా యథాశక్తి ఇప్పుడే ధనం ఇవ్వాలి.'

ధనం మాట వచ్చేసరికి రైలుపెట్టె స్తంభించి పోయింది రైలు కదలుతున్నా పెట్టెలో మనుషుల ఊపిరి ఆడుతున్నదో లేదో పోల్చుకోవడం కష్టం!

ముసలాయన కళ్ళు అలాగే తెరిచేసి కునికి పాట్లు పడనాగాడు యువకుడి ఆటోగ్రాఫు బుక్ జేబులోకి పోయింది ఎదురుగ కూర్చున్నా తన ముఖాన్ని దిన పత్రికలో దాచుకున్నాడు.

ఇంకా ఇద్దరు ముగ్గురు అంటిస్తు ఏదో పెళ్ళిళ్ల గూర్చి, విజయవాడ ఎండల గూర్చి సంభాషణ ప్రారంభించారు దూరం తరిగి పోతూన్నది - విజయవాడ వచ్చేస్తున్నది. వల్లభ కవికి తిక్క తిరుక్కొచ్చింది ఈ వాతావరణంలో మార్పును చూచి ఛీ, ఏం జాతి హీనమైన జాతి! దబ్బునంగానే చస్తుంది జాతి. హరిశ్చంద్రుడి నా దెరుగదమా. భోజరాజు నా దెరుగదమా. శ్రీనాధుని నా దెరుగదమా శ్రీకృష్ణరాయలనాడు తెలుసా మనకి దగ్గిర? ఎన్నడూ లేనిది స్వతంత్ర భారతంలో ఎమిటీ అవమానం?' ఆవేశంతో ఓ చిందాల పుస్తకం తీసి "అందుకే నేనన్నాను తెలుగువాడికి తెలుగు తప్ప మరేమీ తెలేదని. పక్క భాషల వాళ్ళను చూచి బుద్ధి తెచ్చుకుంటే సరి - అంటూ వేసరు తర్వాత చదువుదరు. విజయవాడ వచ్చేస్తున్నది. దిగిపోతే మళ్ళా దొరకరు మీరు - వెయ్యండి. మీ ఇష్టం

పుస్తకం బలవంతంగా ఎదురుబల్ల మీద వ్యక్తి ముందుకు నెట్టాడు. ఆ పెద్ద మనిషి వల్లభ కవి దబాయింపుకు తట్టుకోలేక డబ్బు ఆప్పుకోలేక పచ్చి వెలక్కాయ మింగినట్లు ముఖం పెట్టి నాలుక (వేలాడ వేశాడు పళ్ళ సందు నుంచి—

'తియ్యండి. తియ్యండి డబ్బు దబాయిస్తున్నాడు వల్లభకవి. దొంగతనం కాదు బందిపోటు. అన్నట్లున్నది వ్యవహారం అనుకుంటున్నారు పాసెంజర్లు.

'ఏయ్‌గడ్డం పెద్ద మనిషీ, కిందికి దిగిరావయ్యా—ఇదిగో సంతకం చెయ్యి' వల్లభ కవి హుంకారానికి గడ్డం పెద్ద మనిషి కిందికి దిగక తప్పలేదు.'సినిమాలకు క్యూలలో నిలబడి చొక్కాలు చింపించుకొని జేబులు కత్తెరలు వేయించుకొని పళ్ళికిలించుకొని డబ్బులు ఖర్చు చేసుకొని కొంప చేరుతారు. ఉత్తమ సాహిత్యమంటే సరి ఎక్కడలేని దరిద్రమూ వస్తుంది మనకు ఆ వెయ్యండమ్మా చందాలు వెయ్యండి. డిటెక్టివు లయితే చదువుతారు కాని సాహిత్యం అక్కర్లేదా మీకు ..'

వల్లభ కవి వామనుని వలె ప్రారంభించి చూస్తూండగానే త్రివిక్రముడైనాడు—

'మీ కిచ్చిన చందాకు ప్రతిఫలంగా మా కేమిటి ముడుతుంది' పైన మంచి దిగిన గడ్డం మనిషి ప్రశ్నించాడు. వల్లభ కవికి కోపం వచ్చింది 'ఏమయ్యా గడ్డపు పెద్ద మనిషీ! బ్రతుకంతా యుటిలిటేరియన్ పర్పస్‌తోనే చూస్తారా ...చంద్రుడు ఎందుకు వెన్నెల కురుస్తున్నాడు?? పండ్లు ఎందుకు కాస్తున్నాయి- వర్షాలు ఎందుకు పడుతున్నాయి. దేవుడెందుకు సృష్టిస్తున్నాడు ...

'పని లేక' గడ్డం మనిషి సమాధానం'

"ఏడ్చినట్లుంది నీ తెలివి- ఇదంతా నిష్కామ కర్మయోగం. మహా కవుల గ్రంథాలు కొనడమూ చదవడమూ ముద్రించడమూ నిష్కామంగానే జరగాలి- అయినా అంత కోరుతున్నావు కాబట్టి నీకో ఫ్రీ కాపీ అ పుస్తకం పంపుతాలే."

'ఇంతకూ మీరు మహా కవేనని ఏమిటి నమ్మకం!' గడ్డం మనిషి సూటి ప్రశ్నకు వల్లభ కవి మండి పడ్డాడు.

'లోకమంతా అంగీకరించగా నీవు మాత్రం నన్ను మహా కవిగా అంగీకరించవా?'

"అందరూ అంగీకరిస్తే నేను కూడా అంగీకరించాలని ఏముంది.'

---

మీ 'మారని కొలను' నవలలో ముప్పై ఎనిమిది తప్పు ఉన్నాయని నేను ఆరోపిస్తున్నాను. ముంగిసను కరిచిన పాము' నవల అసలు మీరు వ్రాయలేదనీ మీభార్యే వ్రాసి మీ పేరు పెట్టిందనీ నేను నిరూపిస్తున్నాను. మీ మకరంద మాధుర్యం కావ్యంలో ప్రతి పద్యానికీ ఓ తప్పును చూపిస్తాను మీరెలా సమర్థించుకో గలరు?

''గడ్డం పెద్ద మనిషి గడుగ్గాయిగా పరిణమించే సరికి రైలులో తిరిగి రసవత్తరమైన వాతావరణం నెలకొన్నది. అందరి

నిద్రా పారిపోయింది. దిన పత్రిక చాటు నుండి బిదురుకెంచే ఆయన ముఖం ఆశతో రంగస్థలం పైకి వచ్చింది. సర్కసు చూస్తున్నంత వేడుకతో జన మంతా ఒళ్ళంతా కళ్ళు చేసుకొని ఉత్సాహంగా కూర్చున్నారు. మహాకవితో గడ్డం అర్భకుడు దెబ్బలాట పెట్టుకున్నాడు. ఇతని పొగరు ఎలా అణుస్తాడో చూడాలని పాసింజర్ల వేడుక. "కుర విమర్శకుడా" వల్లభ కవి గాండ్రించాడు పెద్ద పులిలా.

'నీవు పైస లివ్వకపోతే మానెయ్' అంతే కాని ఇచ్చే వాడికి రాహువులా నీ గడ్డం అడ్డంపెట్టకు' శ్రోతలందరి సాను భూతి ఆకారణంగా మళ్ళీ వల్లభకవి వైపే తిరిగింది. తాము పైస లివ్వక పోవచ్చు. వల్లభ కవి తమ్ము దణాయించ వచ్చు - అది వేరే విషయం. కాని ఎవడో ఓ గడ్డంవాలా ఇలా మహాకవిని విమర్శించడం వాళ్ళకు నచ్చలేదు. అతను మనలో ఒకడనీ, తమ్ము దందాబారినుండి రక్షించేందుకే పోట్లాటకు దిగాడనీ ప్రజలు మరచిపోయారు.

'అడ్డం పెట్టే తీరుతాను. మిత్రులారా! ఈ వల్లభకవికి ఎవ్వరూ ఒక్క పైసా ఇవ్వకండి' తెగబడి అడ్డు నిలిచి గడ్డం మనిషి అరిచాడు కీచురాయిలా.

వల్లభకవి ఒక్క దెబ్బతో ఈ గడ్డం వాలాను పడకొట్టెదడని అందరూ ఆశించారు కాని అలాంటిదేమీ జరుగలేదు. చందా పుస్తకం తీసి వల్లభకవి సంచీలో సర్దుకోవడం చూసి టిక్కెట్టు లేని ఈ వినోదం ఇంకా చిత్తగించాలను కున్న ప్రజలు అసంతృప్తి చెందారు. గడ్డంమనిషి ఇలా ఆశించని విజయం పొందడమూ వారి కంత నచ్చలేదు . 'వల్లభకవికి జై - వల్లభకవీ జిందాబాద్' ప్లాట్ఫారంపై కేకలు - ఈ జాలో వడి రైలు ప్లాటుఫారం చేరడం కూడా మరచిన ప్రజలు గబగబా సామాన్లు సర్దుకో సాగారు.

'అయ్యా తమకేదో సన్మానంలా గుంది' పక్కనున్న మనిషి ప్రశ్నను కూడా వినిపించుకోకుండా వల్లభకవి బెడ్డింగును తలుపు దగ్గరికి లాక్కున్నాడు...'వల్లభకవీ వర్ధిల్లాలి వల్లభ కవీ జిందాబాద్ ' కార్యకర్తలు ఈ డబ్బాదగ్గరకి వచ్చి చూచారు అనందంతో ఒక్కసారి లోపలికి వచ్చి పూల దండలు వేశారు.

'తమరు థర్డుక్లాసులో వచ్చారేమిటీ! మీకోసం మేము ఫస్టుక్లాసు పెట్టెలు వెతుకుతున్నాము '

'అది సరే - చూడండి ఈ గుమ్మం దగ్గర బెడ్డింగుతో ఒకాయన ...' కార్యకర్తలు చూచారు. గుమ్మం దగ్గిర వల్లభ కవి ఎప్పుడో ప్లాటుఫారంపై జనంలో కలిసిపోయాడు. వినాదాలు చేస్తున్న కార్యకర్తల మధ్యకు దిగి కృతజ్ఞత సూచకంగా చేతులు మోడ్చి. నిలిచి బరువైన పూలదండలతో ముందుకు సాగడు గడ్డం మనిషి!

# పనికిరాని పరిజ్ఞానం

ప్రపంచంలో మొట్టమొదటిసారిగా 'కళ్ళజోడు' కనుగొన్నవాడు "ప్లేనియోగి యేజ" అను ఇటలీ దేశస్తుడు 1302వ సంవత్సరములో కనుగొన్నాడు.

* * *

వెదురుచెట్టు వందసంవత్సరాలకొకసారి పూతపూస్తుంది.

* * *

మనదేశంలో యిప్పుడున్న విశ్వ విద్యాలయాలలో కలకత్తా విశ్వ విద్యాలయం మొదటిది. ఇది 1657 సం॥ జూన్ 24న స్థాపింపబడింది.

అప్పుడే పుట్టిన 'కంగారు' ఒక ఔన్సు బరువు కలిగియుంటుంది.

* * *

తెలుగుభాషలో ప్రప్రథమంగా అచ్చయిన పుస్తకం బైబిలు.

* * *

చిరుతపులి సుమారు 300 లేక 400 సంవత్సరములవరకు జీవిస్తుంది. ఇది గంటకు 60 మైళ్ళ వేగంతో పరుగెత్తగలదు.

* * *

రాబిన్ పిట్ట ప్రతిరోజూ తనకు ఎనిమిదిరెట్లు బరువుగల ఆహారము తిని అరిగించుకోగలదు.

సేకరణ: ఎ. చలపతిరావు, ఎస్. గోవిందరాజు.

# ఆకలి శిఖరాలు

నేను ఆ రోజు ఆఫీసునుంచి యింటికి వచ్చేసరికి యింటిముందు జనం బిలబిల లాడుతూ గుంపుగా గుమిగూడి వున్నారు.

అందరూ 'అయ్యో' అనీ, 'పాపం!' అని సానుభూతిగా చూస్తూ ఏదో అంటున్నారు.

కొంపదీసి ముసలాయనకు గుటుక్కుమన లేదు కదా!

నేను అదుర్దాగా జనాన్ని తోసు కుంటూ లోపలకు వెళ్ళాను.

ముందు గదిలో మంచంమీద కుసుమ పడుకొని వుంది పడుకొని వుంది అనే కంటే పడివుంది అనడం నయం!

ఒక్కడు డాక్టర్ కూర్చుని ఏదో ఇంజక్షన్ యిస్తున్నాడు.

ముసలాయన కుసుమ కాళ్ళ దగ్గర కూర్చుని వున్నాడు. సహితి తల్లి ముఖం మీదికి ముసుగు లాక్కొని ఆయన వెనక నిలబడి వుంది.

ఆయన నన్ను చూడగానే 'కుసుమ నా కొంప తీయటానికి చూసింది.

ఏం ఎక్వరం లేకుండా మాకి వ్రేసు కుంది.' అంటూ ఘొల్లుమన్నాడాయన.

జనంలో కలుగుతూ నాలుగు రకాలుగా గుసగుస లాడుతున్నారు.

కుసుమ ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించిందా!

పట్టుమని 18 సం॥ కూడా లేని ఈ అమ్మాయికి జీవితం మీద అప్పుడే ఇంత విరక్తి ఎందుకు!

నన్ను చూడగానే చిట్టి పరిగెత్తు కొచ్చాడు ముఖం ఏడ్చినట్టు ఉబ్బి వుంది, కళ్ళు ఎర్రబడి వాచి వున్నాయి.

నా చెయ్యి పట్టుకుంటూ వెక్కిళ్ళతో 'అంకుల్' అక్క చచ్చిపోయింది!' అన్నాడు.

"హుమ్! తప్పు! ఆ మాట అన కూడదు నువ్వు అదృష్టవంతుడివి కాబట్టి ఆ అమ్మాయి బ్రతికింది." మరో ఒక ముసలమ్మ చిట్టిని మందలిస్తు న్నట్లు అంది. డాక్టర్ ఇంజక్షన్ యిచ్చి వెళ్ళటానికి లేచాడు.

"ఫర్వాలేదు లెండి. సమయానికి మీరు వచ్చారు కాబట్టి సరిపోయింది:" అన్నాడు ధైర్యం చెబుతున్నట్టు.

వచ్చిన వాళ్ళలో ఒక్కొక్కళ్ళే వెళ్ళి

పోసాగారు.

నేను చిట్టిని ఎత్తుకుని పైకి వచ్చాను. వాడిని దగ్గర కూర్చో బెట్టుకుని, బుజ్జగిస్తున్నట్టుగా అడిగాను. వాడి మాట బట్టి నేను తెలుసుకున్నది యిది.

నిన్న వుదయం తండ్రి చిన్న భార్య చెప్పిన మాటలు విని కుసుమని చీపురుతో కొట్టాడట! నీ తమ్ముడు నువ్వు వెళ్ళి ఎండలోనైనా పడి చావండి అని తిట్టాడు. కుసుమ బాగా ఏడ్చిందట! నిన్నంతా అన్నం తినలేదు! రాత్రి తండ్రి యింటికి వచ్చి కుసుమ అన్నం తినకుండా కూర్చున్నందుకు మళ్ళీ తిట్టాడట. కుసుమ అన్నం తినలేదు. రాత్రంతా ఏడుస్తూనే చివరనున్న డాక్టరు కోసం పరుగెత్తాడు తల్లీ తండ్రీ బజారునుండి వచ్చేసరికి ఇంటి ముందు జనం మూగివున్నారు. యిదీ జరిగిన సంగతి.

యీడు వచ్చిన పిల్లని చీపురుతో కొట్టాడనే విషయం వినగానే నా ఒంటినిండా తేళ్ళూ, జెర్రులూ పాకినాయి.

ఎంత బుద్ధిలేని మనిషి వెళ్ళడు పిల్లని యింట్లో పెట్టుకుని చిన్నభార్యతో సినిమాలు, షికార్లునూ తమ వయసు చెల్లిన మనిషి! తను కాస్తా గుటుక్కుమంటే వాళ్ళ భవిష్యత్తులు ఏమయిపోతాయోనన్న బెంగే లేదాయనకి. 'ఆ

# యద్దనపూడి సులోచనారాణి

వుంది. వుదయం లేచి పనంతా చేయలేదని పింతల్లి చిరాకు పడిందిట.

మధ్యాహ్నం తల్లి-తండ్రి కలిసి బజార్లో ఏవో కొనుక్కోడానికి వెడుతూ చిట్టిని ఆడుకోటానికి వెళ్ళమని పంపి ఈ పని చేసిందట! అదృష్ట వశాత్తు అదే సమయంలో పక్కింటి గోవిందమ్మ అప్పుగా తీసుకెళ్ళిన బియ్యం యివ్వటానికి వచ్చింది. తలుపులు తీసివున్నాయి కుసుమని పిలిస్తే పలకలేదు. ఆవిడ ఇంట్లో చనువుగల మనిషే కాబట్టి సరాసరి లోపలికి వచ్చింది. కుసుమని చూడగానే నలుగురికీ కేకలు పెట్టి పోగుచేసింది.

కుసుమ కొనవూపిరి తీస్తోంది. ఎదురింట్లో అద్దెకుంటున్న కుర్రాడు. వీధి వాళ్ళ ఖర్మ వాళ్ళదే అనే పెట్టె సాంతం ఒలకపోస్తాను.

ఆ రాత్రి అందరూ పడుకున్న తర్వాత పొద్దుపోయిన తర్వాత ముసలాయన నా దగ్గరకి వచ్చాడు.

వస్తూనే బుడిబుడి రాగాలు తీస్తూ, 'చూసారా బాబూ! ఈ పెద్ద వయసులో నాకు కాస్త కూడా మనశ్శాంతి లేదు. నలుగురిలో నన్ను గోలచేయడం కాకపోతే దానికిప్పుడు అంత కష్టం ఏమొచ్చింది చెప్పండి.

వాళ్ళకి యింత చాకిరీ చేసి పెడ్తుంటే ఆ సవతి తల్లి అదంటే కించిత్తు కూడా లక్ష్యం లేదు. దాని ఖర్మగాని. పేద కుటుంబంలో పుట్టి, డబ్బు లేక నాకు

# జరిగిన కథ

అనధశరణాలయంలో వచ్చిన వుద్యోగంలో యెంతో కాలం నిలువలేకపోయాను ఇంటర్వ్యూకి వెళ్ళిన నాకు గోపాలంతో పరిచయమైంది ఉన్నట్టుండి గోపాలానికి సుస్తీ చేయడం వల్ల అతని డ్యూటీ నేను చేపట్టి ఆ విధి నిర్వహణలో సమాజంచే దొంగగా ఊహించబడ్డాను.

బాబాయి ఏదో సంబంధం ఉన్నదని ఆరువేల కట్నం ఇస్తారని దాంతో తన బాకీ తీర్చవచ్చని ఉత్తరం రాశాడు నేను ఆ సంబంధం చేసుకోను. ఏ బాకీ తీర్చలేని అసమర్థుడనే అని ఉత్తరం రాశాను. గోపాలం ఆరోగ్యం కొంత కుదుటపడింది. గోపాలం బలవంతం మీద సినిమా హాలు గేటు కీపరుగా చేరటానికి ఒప్పుకున్నాను

అక్కడ తలవని తలంపుగా పాత పరిచయస్తురాలు శాంతి తటస్థపడింది. సిగ్గుతో కుంచించుకుపోయాను గతమంతా స్మృతిపథంలో తిరగడం మొదలైంది

తరువాత 'జ్వాలాముఖి' పత్రిక నుండి ఇంటర్వ్యూ వచ్చింది ఎడిటర్ ఆదరంతో ఆ ఉద్యోగం నాకే యిచ్చారు.

ఒక రోజున శాంతి నా కోసం గోపాలం ఇంటికి వచ్చి వాళ్ళ ఫ్యాక్టరీలో మేనేజరుగా చేరమని కోరింది. నాకు వేరే ఉద్యోగం దొరికింది మీ దగ్గర చేరలేను అని చెప్పాను. అలా అన్నందుకు గోపాలానికి నా మీద కోపం వచ్చింది. తరువాత గోపాలం ఆ ఉద్యోగంలో చేరాడు. 'జ్వాలాముఖి' సర్క్యులేషన్ పెంచాలనే ఉదేశ్యం 'ఇదీ మనదేశం' అన్న హెడ్డింగుతో ఒక శీర్షిక ప్రారంభించాను.

తరువాత ''జ్వాలాముఖి ' పేపరు ఎత్తేసి, ప్రెస్ను అమ్మేస్తామన్నారు గాని సుభద్రమ్మగారు ఎవరిదగ్గరో డబ్బు తీసుకుని నా చేత నోటు వ్రాయించి యిచ్చారు దానికి ప్రతిఫలంగా నన్ను ఆ ప్రెస్లో భాగస్వామిగా వుండమన్నారు తరువాత ఆ అప్పిచ్చింది శాంతి అని తెలిసింది.

—ఇక చదవండి.

ఆపరేషను చేయించుకోడానికి వచ్చిన రోగి ఒకటే భయపడిపోతూండటం చూసి—

డాక్టరు: ఎందుకలా భయపడిపోతున్నావు?

రోగి: నేను ఆపరేషన్ ఇంతకుముందు ఎప్పుడూ చేయించుకోలా! ఇదే మొదటిసారి!

డాక్టర్: నేను మాత్రం ఇదివరకు చేశానా? ఆపరేషను చేయడం ఇదే మొదటిసారి. అయితేమాత్రం నేను భయపడుతున్నానా? —ఇందిర

---

రెండో భార్యగా వచ్చింది. మరి దాని సరదాలు, కోరికలు కూడా తీరాలిగా. దాన్ని తీసుకుని నేను సినిమాకి వెళితే యీ బజారు వాళ్ళందరికీ విచిత్రమే! చిన్నతనంలోనే పెళ్ళయి వెంట వెంటనే పదిమంది పిల్లలు పుట్టి వాళ్ళని గురించిన బాధలతో చితికిపోయాను కానీ. నా వయసు వాళ్ళు ఎంతమంది ధ్వంసంగా లేరు!" ఆయన ధోరణి నాకర్థమైంది!

జీవితం చరమదశలో అడుగుపెట్టిన ఆయనకి హఠాత్తుగా జ్ఞానోదయం అయింది. బ్రతుకుని వేయి రకాలుగా అనుభవించాలనే కోరికలు పుట్టుకొగా మెలుస్తున్నాయన్న మాట! ఆ స్వార్థంలో ఆ తహతహలో ఆయన కంటికి యింకేదీ కనిపించడం లేదు. ఆయన రక్తం పంచుకు పుట్టిన బిడ్డలే ఆయనకి పెడ, అడ్డుగ కనిపిస్తున్నారు. నిజం ఖచ్చితంగా చెప్పాలంటే యీనాడు కుసుమ బ్రతకటం కంటే, పోతేనే ఆయన ఎక్కువ సంతోషించేవాడేమో! పెళ్ళి చేయాల్సిన పనితప్పేది! ఆ డబ్బు మిగిలేది! నా దగ్గరకి వచ్చి కూర్చున్న రెండు గంటల్లో యీ జరిగినదానికి కుసుమ అన్యాయంగా ఎక్కడ బలిఅయిపోయిందో అనే దిగులు గానీ, కంగారుగాని చూపిస్తూ ఒక్కమాట కూడా ఆయన నోటినుండి రాలేదు. నిజంగా! మనుష్యులంత స్వార్థపరులుగ వుంటారా! లేక-యీ మధ్య తరగతి సంసారాల్లో యిబ్బందులు పడి పడి, వాళ్లలో ఆత్మీయత అనేది యిగిరిపోయి యిలా తయారవుతారా!

నాగలక్ష్మి చెప్పినట్లు ఆయనవైపు ఆలోచించి చూస్తే అదీ నిజమే! కాని దానికి కుసుమ బాధ్యురాలు ఎలా అవుతుంది!

యిందులో ఆ అమ్మాయి చేసిన నేరం ఏముంది!

నా మనసంతా కుసుమపట్ల సానుభూతితోనే నిండి పోయింది.

ఎందుకంటే కుసుమని చూసినప్పుడల్లా మా బాబాయికూతురు లక్ష్మి

గుర్తువస్తుంది! ఇద్దరూ రమారమి ఒకే వయసు వాళ్ళు పరిస్థితులు కూడా దాదాపు ఒకటే. కానీ అమ్మకి పాపాయి, చిన్న చూపే ఆత్మీయత. అనురాగం కుసుమకి లేవు.

పై సంఘటన జరిగిన నాలుగురోజు లకి నేను అప్పుడే గోపాలం యింటి నుండి తిరిగివచ్చాను.

కుసుమ నా గది వూడ్చి, మంచినీళ్లు పెట్టి కిందకు వెళ్ళిపోతోంది. యీ మాత్రం గది వూడవటానికీ, రెండు బకెట్లు నీళ్లు తేవటానికి పనిమనిషి కుదరదని, ఆ పనేదో మా వాళ్ళే చూస్తారులెండి అంటూ నేను చేరిన మొదటి నెలలోనే ఇంటా యన నాకు చెప్పాడు.

నా గదిలో నేను పోగొట్టుకుంటా నని భయపడేంత ఖరీదుగల వస్తువులు ఏమీ నా దగ్గర లేవు అందుకని నేను వెళ్ళే టప్పుడు గది తలుపులు దగ్గర వేసి వెళుతూ వుంటాను. వాళ్ళకి వీలున్నప్పుడు వచ్చి శుభ్రం చేసి వెళ్ళిపోతారు చిట్టిమాటలని బట్టి యీ పని ఎప్పుడూ కుసుమే చేస్తుం దని తెలుసుకున్నాను

ఆరోజు నేను మెట్లెక్కి పైకి వచ్చే సాను

కుసుమ నా గదితలుపులు దగ్గరేసి వెళ్ళిపోబోతోంది.

గది వూడ్చినట్టు నిదర్శనంగా చేతిలో చీపురువుంది.

నన్ను చూడగానే కుసుమ తలవం చుకుని గబగబా వెళ్ళిపోతోంది. ఆత్మ హత్యా ప్రయత్నం తలపెట్టిన తర్వాత నేను కుసుమని చూడడం యిదే మొదటి సారి,

"కుసుమ్!" పిల్చాను నేను. ఆ ఇంట్లో అందరూ కుసుమని అలాగే పిలు స్తారు. చిట్టి మాటల్లో కూడా అలాగే చెబుతాడు. నాకు తెలియకుండా నా క్కూడా అదే అలవాటయింది.

కుసుమ నా పిలుపు వింది.

ముందుకి వెళ్ళబోతున్నదల్లా ఆగింది.

కానీ వెనక్కి తిరగలేదు.

"మీ నాన్నగారున్నారా యింట్లో?"



ధైర్యవచనాలు చెప్పే వాడు చాలా అవసరం అనిపించింది.

కుసుమకి ఉపన్యాసం ఇవ్వడంతో నా పని ముగిసిందని నేను అనుకోలేదు. తర్వాత ఒకసారి సుభద్రమ్మగారి దగ్గర మాటల సందర్భం వచ్చినప్పుడు కుసుమ విషయం అంతా చెప్పాను. ఆ అమ్మాయికి ఉపాధి ఏదయినా చూపించమని ప్రత్యేకంగా కోరాను.

కుసుమని తన దగ్గరకి తీసుకురమ్మని, ఆ అమ్మాయిని చూసి ఏం పని చేయగలదో నిర్ణయించుకుని ఆ పని ఒప్పచెబుతానని అన్నారు.

ఒక వాడు శాస్త్ర ఇబ్బంది కలిగించే విషయమే!

కుసుముని నా వెంట పంపమని అడిగే సాహసం నాకు లేదు!

దానికి చాలా విపరీతమైన అర్థాలు వస్తాయి! కథలు పుట్టినా పుట్టవచ్చు! నా ద్వారా ఉపకారం జరగాలి కాని అపకారం జరిగితే ఎలా? ఆ అమ్మాయికి మంచి చేయాలని అనుకుంటున్నానే తప్ప అనవసరంగా నలుగురి నోళ్ళలో పడటం ఇష్టం లేదు నాకు. అందులో ఆమె సవితతల్లి, ఆవిడ చుట్టూ చేరే మహిళా బృందం సంగతి నాకు తెలుసు.

పెళ్ళిగా యింటాయనతో సుభద్రమ్మగారి సంగతి చెప్పాను. ఆవిడకు ఎవరైనా ఆడపిల్లలు చేతిలో అవసరం వుండి, ఎవరినైనా వుంచు చూసి పెట్టమని చెప్పి ఆయన ముందు ఎవరూ లేరన్నారు. తర్వాత మన కుసుమ వుందిగా బాబూ అది పనికి రాదంటారా అన్నాడు.

నేను కుసుమకి చదువు రాదనే సందేహం బైట పెట్టాను.

ఆవిడ ఒప్పుకుంటారో లేదో అన్నాను.

'బాబ్బాబు. నీకు పుణ్యం వుంటుంది ఏదోలా నాలుగు రాళ్ళు మా కుటుంబానికి కలిసి వచ్చేలా చూసి పెట్టు చచ్చి నీ కడుపున పుడతాను. నీ తండ్రిలాంటి వాడివి'' అంటూ బ్రతిమలాడాడు.

నాలుగు రోజులు ఆయన చేత అడిగించుకుని, బ్రతిమలాడించుకుని. చివరికి కుసుమని సుభద్రమ్మగారి దగ్గరకి తీసుకు వెళ్ళటానికి అంగీకరించాను.

కుసుమతో ఆవిడ మాట్లాడారు. ఇంటి పరిస్థితులన్నీ విన్నారు.

కుసుమని క్లబ్‌లో వున్న చిన్న లైబ్రరీకి గుమాస్తాగా తీసుకున్నారావిడ. ప్రస్తుతం యిది ఖాళీగా వుంది. తర్వాత చూద్దాం అన్నారు వారు. జాయినైనంది జీతం కాని కుసుమకి కొంత వ్యాపకం! నేను అనుకున్నది లభించింది.

కుసుమ కళ్ళలో కృతజ్ఞత చూసినప్పుడు నా మనసు అర్థమైంది. ఏదయినా కాస్త ఆధారం దొరికితే కష్టపడటానికి, జీవితంతో పెనుగులాడటానికి కుసుమలాంటి ఆడపిల్లలు, మగపిల్లలు ఈ దేశంలో చాలా మంది వున్నారు. వాళ్ళ నిరీక్షణా, ఆశ ఎవరికి కనిపిస్తుంది ఎవరికి వినిపిస్తుంది!

[సశేషం]




బి.యస్.గణేష్ పాత్రో

అది రమణీయ 'మందు' పురము.

ఆ పురమందొక 'బారు'.

బారులో నదియొక మారు మూల గది.

ఆ గది తలుపులు తోసి మెల్లగా పదు నయిదేండ్ల యీడు గల బాలిక.

పోలిక రామచిల్క-

జంకొదవని కాళ్ళతోడ చనుచున్నది లోనికి దేనికోసమో!

అయ్యా! తమలో సగం మంది బుద్ధిమంతులు. అంచేత బారుకథ మీకు తెలిసుండకూడదు. గానీ తెలిస్తే తప్పేం లేదు. గనుక ఈ నా చెప్పంబోవు బారు కథను శ్రద్ధాసక్తులతో అవధరింపుడు.

అసలు మందు బారు అనగానేమి?

సబ్బుబారు, సాంబారు, చీమలబారు, కొంగల బారు, ఏక్ బారు, బార్ బారు, అండమాన్నికోబారు, ఆ బారూ, ఈ బారూ అవాదిలేస్తే అసలు సిసలైన బారొక టుంది.

అది స్వర్గానికి ఒక బీడ్ తరవా యిలో వుంటుంది.

నరకంపు. నరకపు కంపు కొడుతూం టుంది.

"గాంధీగారు పుట్టేసి మూరేళ్ళయి పోయిందో ఛ' అని చెంపలు గుద్దు కుంటూ దేశంలో నలుమూలలా 'బార్లు' బార్లు బార్లుగా తెరుచుకున్నాయి. అయినా అందులో తప్పేముంది? తప్పు లేదు. గాంధీజీ, వినోబాజీ-వాళ్ళకి అక్కర్లేక పోతే తాగొద్దు పోనీ! గానీ మేం తాగ డానికేం? జనాభా అంతా వినోబాలే కావాలా? కానక్కర్లేదు అందువల్ల తప్పు లేదు తప్పు లేనందువల్ల బార్లున్నాయి. బార్లా తెరుచుకు మరీ వున్నాయి.

జనతారావుగారని మా వూరి చైర్మను చాలా పెద్దమనిషి. చెవర్లెట్లో వెనక సీటంతా పరుచుకూర్చొని-పక్కన పెట్టు కున్న సిగరెట్ బ్రాస్ కేసు కాస్త కుదుపుకే పచ్చడై పోయేంత పెద్దమనిషి.

అసలు పూర్వకాలం ప్రొహిబిషను ఉంటుందే రోజుల్లోనైతే-అవళంగా తన వీపు వెనక అరడజను మందు సీసాల్ని కనికట్టుచేసేసి. పోలీసోళ్ళకి కందుకెల్లి

తిపిపించగల గొప్ప శాస్త్రీ. అదంతా మందు బలం అంటారు. ఆ శరీరంలో ప్రవహిస్తున్నది రక్తం ఎంత మాత్రం కాదనీ, అది కేవలం మందేననీ చెప్పు కుంటారు కొందరు మందుభాగ్యులు. అంచేతనే గత ఎన్నికల్లో అపోనెంటు పోలుపిల్లిప్పారావుగారు ''జంతారావు అంజికోడుకి రక్తం తాగిసిస్తాను" అని ప్రమాణం చేసినప్పుడు, జనతారావుగాంధీ మహాత్ముడ్లాగా చిరునవ్వు నవ్వి. "అయ్యో బెదర్! తప్పకుండా తాగుదువుగాని అలా అలిసిపోకు, ఇలా రా!" అని చేరబిలిచి బారులోకి తీసుకెళ్ళి పీకమొయ్యా అప్పా రావుగాడిచేత తాగింపించాడు. తనరక్తానికి ప్రత్యామ్నాయమైన 'రమ్ము'ని. అది శాస్త పుచ్చుకోగానే అప్పారావుగారు శాంతించాడు, తన విరమణ పత్రాన్ని అందజేసాడు దానితో జనతారావుగారు చైర్మను ఆయిపోయాడు. అంత పెద్ద మనిషి!

ఆసలింతెందుకు? 'దొంగలంజకొడుకు లవలే మసలే ధూర్తలోకంలో "నువ్వు పెద్దమనిషివి కావు" అంటే ఒప్పుకునే పెద్దమనిషెవడూ లేడు గదా! అందువల్ల అందరూ మహాన్భావులే అందులో ఒకడు జనతారావుగారు. ఆతనిప్పుడు మనకెందు కండి! ఆతనిదే మనం చూడబోతూన్న బారు.

సగంలో మీరిప్పుడీ కథ చదవడం మానేయరని బారుమీద ప్రమాణం చేసి చెబితే-మీకొక రహస్యం చెప్తాను. మానే స్తాతా కొంపదీసి! ఏమో బాబూ. మిమ్మ ల్నెవడు నమ్మమన్నాడు? తాగినవాడే తప్ప మరొకడు నిజం చెప్పడని మా మందు మేట్లు నాతో ఒకమారన్నాడు. మీరింకా బారులోకే రాలేదు గనక మీచేతప్రమాణం చేయించుకోవడమే లౌక్యంగదా? అంచేత పట్టండి మరి—

"బారు యెదట ప్రమాణం చేసి- అంతా పూర్తయ్యేదాకా చదువుతాను. సగంలో ఆపేయను."

అది! ఇంక మీరు తప్పించుకోలేరు. మాట తప్పారంటే బారు పూరుకోదు.

అంచేత నేను చెప్పబోయే చిన్న రహస్యం ఏమిటంటే చిత్తం, నే నెప్పుడూ బుద్ధి తెలిసి బారు మొహం చూశ్శేదు-గానీ, అదుగో మీరు పేజీ తిరగేసేస్తున్నారు. చంపేస్తాను. ప్రమాణం గుర్తు చేసుకోండి. మాట తప్పారా, బార్లో బార్లా కూచోబెట్టి మారేళ్ళ కిందటి రావిస్కీ సీసాని బోర్లా వంపేస్తాను నోరు సాగదీసి!

"బారు మొహం చూడనివాడివి నువ్వు మాకు బారు కథేం చెప్తావోయ్, బోరు కథ" అనబోతున్నారు మీరు నాకు తెలుసు. గానీ, అయ్యో! చూడనివాణ్ని గనకనే నేనుదాని మీద కథ రాస్తున్నాను. చూసిన వాడురాస్తాడా? అబ్బే రాయడు. రాసిన వాడ్ని కోస్తారు. కోసి కాకులకీ, గద్దలకీ వేస్తాదు పద్నాలుగేళ్ళు బారు బహిష్కా- రము చేస్తాడు-గనీ నేనే రాస్తాను!

ఎంచేతనంటే నాకు బారు ఇంటరెస్టు లేదు.

నేనెప్పుడూ బారు కెళ్ళలేదు.

అంచాత అవాకులూ చవాకులూ వాగ డానికి హక్కు నా ఒక్కడికే వుంది.

రాజకీయాలు బొత్తిగా తెలియని వాడు మాత్రమే ఇందిరాగాంధీని పబ్లిగ్గా విమర్శించగలడు

రాజ్యాంగం సుతరామూ ఎరగనివాయ కులే మంత్రాంగాన్ని నిర్వహించగలరు.

కదా?

నేనొక్కమారే బారు కెళ్ళాను ఇది పెద్ద రహస్యం కాదు. ఔను ఒకమారే వెళ్ళాను. ఆ వెళ్ళిన ఒక్కమారే ఒక పెద్ద కథ జరిగిపోయింది నా కళ్ళముందు. ఆ కథ మీకు చెప్పదల్చుకున్నాను. కర్మ కాలి దానికి 'బారుకథ' అని పేరు పెట్టు కున్నాను. కథంతా చదివి 'హోరుకథ' లేదా 'కన్నీరు కథ' అదేమీ కాకపోయిన పిమ్మట-సరే, 'బారుకథే' అనండి. ఒప్పు కుంటాను. గానీ అందాకా మాత్రం తీరు బడిగా చదవండి

ఆవాళ బొత్తిగా ఆదివారం

చెన్నపట్నంలో ఉద్యోగం చేసుకుం టున్న మా బావమరిదొకడు అదేదో పని మీద మా వూరొచ్చి రెండ్రోజులైంది. ఆతను కాస్త 'రస'గ్రహణ పారీణుడు. గానీ తమిళనాడులో గాంధీగారి కింకా మారేళ్ళు విండినట్టు లేదు. మద్యపానం పబ్లిగ్గా నిషేధించారట.

"బావా, కొంచెం తడి పడాలోయ్" అన్నాడు అర్ధనగ్నంగా నవ్వుతూను. నేను కూడా నర్మ గర్భంగా కన్ను కొట్టే శాను. అదంతే! చెడవంతవరకూ ఎవడూ చెడడు. గానీ చెడిపే సాధుదొకడు తోడు దొరికితే చెడేందుకు మొగమాటపడేవాడు కూడా వుండడు. సెంటెన్స్ బాగులేదు కదూ! ఫరవాలేదు. నా ఉద్దేశం ఏమిటంటే అందరూ ఎలాగైతే మంచి వెధవలో - అలాగే అందరూ చెడ్డవెధవలు కూడాను. ఎటొచ్చీ కాలం కర్మం కలిసి రావాలి. అంతే!

బయల్దేరాం!

చీకటి పడుతోంది.

ఆదొక రకమైన బారు టెన్షన్ నాలో ఆవహించిం?. బారు మరొక పని బార్లలో ఉంటుందనగానే నాకు కళ్ళు మసక మసగ్గా, తల కాస్త తిరుగుతూ న్నట్టుగా కావాగింది. షట్చక్రవర్తులూ నవగ్రహపర్యంతం ఏలే ఈ విశ్వాంత రాళమంతా "వాట్ 69" సీసాలాగా గిర్గిర్గిర తిరిగేయసాగింది నా కళ్ళ ముందు. ఆమెన్!

"నేనెప్పుడూ తాగలేదు బావా!" ఇదుగో యింవాకా మితో బారు చూడలేదని మనవి చేసుకున్నంత భయంగా నే చెప్పాను మా బావతో!

అతగాడు తెల్లబోయాడు. పడి పోయాడు. లేచిపోయాడు. నవ్వు నాపు కోలేక పోయాడు.

"నిజం?" అన్నాడు.

తలూపాను భయం వేసి.

మళ్ళీ నవ్వాపుకోలేక పోయాడు లేచి పోయాడు. పడిపోయాడు. తుళ్ళిపోయా డతగాడు.

"మరైతే ఎక్కడికి బయల్దేరావు?"

"బారుకే."




తుళ్లిపోయాడు.

"ఎందుకు?" అడిగాడు.

"నీకు తోడుకి. గానీ తాగను నీ తోడు."

పడిపోయాడు

"నిజం బావా. ఎందుకొచ్చినరొష్టు? ఏదో సర్దాకి బయల్దేరాను గానీ. అలవాటు లేని పనులాటి' అన్నాను.

లేచిపోయాడు.

"భలేవాడివేనే! మరి (నవ్వు) మరి చెప్పుకోవూ? (నవ్వు) తాగవా? (నవ్వు) నీకు నీకు సిగ్గులేదు బావా? (నవ్వు) సిగ్గులేదూ అలా చెప్పడానికి? అసలు... (నవ్వు)...అసలు మీ వూర్లో జనాలంతా తాగుబోతు లంజికొడుకులేనే"

నవ్వు నాపుకోలేకపోయాడు

బారు భవనోపరిభాగాన అలా నిలబడి గంటన్నరసేపు గుద్దుకున్నాం. ఇద్దర మూను. తాగి తీరాలని మా బావ. తాగను మొర్రో అని నేను. 'తోడులేక వేసుకునే వాడుక లేదు' అంటాడతను? 'అసలు వేసుకునే వాడుకే నాకు లేదు. తోడుంటాను. గానీ వేసుకోను' అని నేను.

ఒగ్గడియ కోప్పడ్డాడు. మళ్ళీమారు బుజ్జగించాడు. భయపెట్టాడు బ్రతిమాలాడు? బారుకొచ్చి కనీసం. ఏది? బీర్రైనా తాగకపోతే నోరు పుచ్చిపోతుందనీ పేరు వచ్చిపోతుందని శపించాడు శాసించాడు.

బీరుమీద లెక్చర్ కొట్టాడు.

"బీరు! అసలు, బీరూ అంటే అది చారు వంటిది, సాంబారు వంటిది. ఆకలి పుట్టిస్తుంది. గర్భిణీ స్త్రీలు పుచ్చుకుంటే సుఖప్రసవమై పోతుంది. ఇంగ్లీషువాళ్లు దీన్ని ఎపెటైజర్ అందురు. ఇది పీపాలు

పీపాలు తాగేసినా ఏం చెయ్యదు. ఒక మారు మా మందు మేటొకడు చిన్నప్పు డెప్పుడో కాలుజారి, పీరు గోలెంలో పడి పోయాడట. అడుక్కి పోయాడట. పది హేన్రోజులు కనపించకుండా పోతేపాపం పిల్లాడ్ని ఏ దెయ్యమో ఎత్తుకపోయిందను కుని పరిపెట్టుకున్నారట గానీ పదహారో రోజున బాటిలింగు చెయ్యడం కోసం బీరుగోలెంమూత తియ్యగానే మనవాడు పనసపండులాగా పైకి తేలిపోయి కేరిం తలు కొడుతూ బీరు జలధిలో జలకా లాడుతూ కనిపించాడట. ఇప్పుడు వాడ్ని




నువ్వు చూశావంటే బావా. ముచ్చటపడి పోతావనుకో! ఎల్లప్పుడూ బీరు పరిమ ళంతో ఘుమ ఘుమలాడుతూ విందుగా బీరు కుండలాగా వుంటాడు. వాడెవడను కుంటున్నావ్? నేనే!''

పాపం నేను బీరు తాగడానికి ఒప్పు కోక తప్పింది కాదు.

ఇద్దరం లోపలి కెళ్ళాం.

మందమైన అద్దాల తలుపు వెనక్కి తోసి తొయ్యడమే మందువాసన గుప్పు మంది గాంధీతాతనైనాసరే పడగొట్టేసే వాసన కొట్టేసింది.

''గుడీవెవింగ్ జంటిల్మన్!''

లేదు. అది యంత్రం కాదు! మనిషి! అదమనిషి!

మందు వాసనకి నాకు మైకం కమ్మే స్తుంటే. అది చానట్టు మందహాసంతో పలకరించింది మదవతి! ఒకటే ట్యూను. ఒకటే వాల్యూమ్ ఒకటే పిచ్. ఒకటే ఇంటోనేషన్. ఒకటే మాడ్యులేషన్. ఒకటే ఎక్స్ప్రెషన్. ఒకటే గెస్చర్. ఒకటే గెస్టిక్యులేషన్ — ఒకటేవిటి. అన్నీ ఒకటే అయిన అందమైన పిల పుతో- కొన్ని వందలు. వేలమంది! గుండెల్లో కితకితలు పుట్టించే ఆ ఒక్కగ నొక్కటే రకం ఒకటో రకం పిలుపుతో మమ్మల్ని కూడా పలకరించింది

తలూపాడు మా బావ.

ఓహో "ఊపాలని, నేను గూడా ఊపాను.

మూలనున్న సోఫాలవైపు తో

తీశాం. ఆ అమ్మాయి కూడా మందు యానంతో తూగుతూ మమ్మనుసరించింది.

బారునిండా జనం కిటకిటలాడుతున్నారు. గానీ స్తబ్దుగా వుంది వాతావరణం. దేనికో జంకుతూన్నట్టు. ఏదో ఉపద్రవాన్ని ఎదురు చూస్తూన్నట్టు! బాంబింగు రోజుల్లో బ్లాకౌటు చేసిన వాతావరణం! ఏ నిమషాన నిషా నెత్తిమీది కొస్తుందోనని థ్రిల్! ఆ బార్లో ఒక ఆచారం వుందట. కిక్కొస్తే కిక్కొచ్చి హిక్కొస్తే, బార్లోని ప్రయివేటు గదుల్లోకి శాల్తీలను ఈడిచేస్తారట కుర్రాళ్ళు. రసం పుచ్చుకుంటే రక్తదాహం కూడా వేస్తుందట కదా! అందుచేత వాళ్ళకి మేతగా ఒక ఆడకూతుర్ని గదిలోకి తోలి తలుపేసేస్తాడు మేనేజరు. కిక్కున్నంత సేపూ కిక్కురుమనకుండా ఆ గదిలో చిక్కిన పేనులాగా కొట్టు మిట్టాడుతారు. ఆ తరువాత కక్కొస్తే బాసు బైటికి కూడా ఈడిచేస్తారు అదే కుర్రాళ్ళు ఈ మధ్య మావూరి రోడ్లు రాత్రి పన్నెండు కావను భయం. కక్కులు. ఉమ్ములు. కూతలు. బూతుల్తో నానా కంగాళీ అయిపోతున్నాయి.

సోఫాలో కూర్చున్నాం ఇద్దరమూను.

"లైక్ మై కంపెనీ?" చాలా పొలైటుగా కిందికి వంగి అడిగింది మాతో వెంబడించిన ఇంగ్లీషు మోడలు పిల్ల. అలా తనంత తానై అడిగితే ప్రవరాఖ్యుడైనా పడిపోక తప్పదు. అందులో మా బావ!

"ఇఫ్ యు ప్లీజ్" అన్నాడు ఇంగ్లీషు వాడ్లాగా.

అవడం తడవు అతి చొరవగా మా బావను తప్పించుకుని గౌను కుచ్చెళ్ళ ముడుతల్లోకి సర్దుకుంటూ, ఆ సర్దుకోవడంలో మందుమీదుందేమో తూలి, నా భుజం మీద వాలి "ఎక్స్‌క్యూజ్మీ" అని చిరుగా నవ్వి, సరిగా నిలబడి - గ్రేషస్‌గా బారంతా ఒకమారు కలయజూసి, మా యిద్దరికీ మధ్య చోటు చేసుకుంది.

అదెక్కడదో బుర్రలో మా యావిడ తపతపలాడింది నాకు.

ఏక్సిడెంటల్‌గా అక్కడికి మా యావిడ రావడం తటస్థించిందనుకోండి. శ్రీపతే రామానుజాయానమః.

కొంచెం దూరంగా సర్దుకున్నాను నేను. పక్కనున్న నా వైపు చూసింది. ఆశ్చర్యపోవాలనుకుని మానేయడం ఆ కనుబొమల్లో స్పష్టంగా కనిపించింది నాకు. ఫక్కుమని నవ్వి మరికాస్త పక్కకొచ్చింది. నాకేం ఫరవాలేదు అమ్మాయి బాగానే వుంది. సన్నగా నాజూగ్గా తీగలా వున్న అమ్మాయి స్పర్శ చేదా? కాదు. గానీ అదుగో, గుండెలమూల దూరంగా గొంతు కూర్చుని మా యావిడ వమ్ము వేలు చూపి బెదిరించేస్తోంది. ఈ కాస్త సంబడం పూర్తి కాగానే ఇప్పుడు చచ్చినట్టు నేను మా యావిడ పక్కకే వెళ్ళాలి వెళ్ళాలే! గానీ ఎలా వెళ్ళాలి? తప్పు చేసిన నా శరీరాన్ని అమాయకంగా మా ఆవిడ లాలించి నిద్రపుచ్చితే, బుద్ధిమంతు






ఎక్కడ
లైఫ్‌బాయ్
వున్నదో అక్కడ
ఆరోగ్యం
వున్నది

లైఫ్‌బాయ్
మురికిలో గల సూక్ష్మ
క్రిములను కడిగివేస్తుంది

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

ళ్లాగా నేను ఒజ్జుకోవడం ఘోరం కదా! ఘోరమే గానీ ఈ యాంగ్లీషమ్మాయి వ్వర్ని బావుంది. ఈ మారు నేనే మరి కాస్త దగ్గరగా జరిగాను. కితకితమని చట్టుకుపోయి నవ్వింది పాపం!

బేరరొచ్చాడు. కుర్రాడు. చాకలా వున్నాడు. ఇరుకు చొక్కా. గొట్టాం పేంటు నెత్తిమీద నవ్వు. నేల మీద పాయింటెడ్ షూసు. వరెవ్వా! జానీ వాకర్ భయ్యా!

మా బావ ఏవేదో ఆర్డరిచ్చి. కాస్త సర్దుకుని అమ్మాయితో కబుర్లలోకి దిగాడు. ఆ అమ్మాయి పేరు 'సుజీ' అట.

ఆర్కెస్ట్రావాళ్ళు ఏవేవో ట్యూన్లు మోయిస్తున్నారు. ఇంకా డాన్సింగ్ అవర్స్ మొదలు కాలేదు. అంచేత క్లబ్బుకి సంబంధించిన కాకా రిక్కార్డు లాంటి ఆడమనిషి..రూమ్మని విరామ టంగా. ధారావాహికంగా. నిరంతరంగా. నిర్నిమిత్తంగా. లయబద్ధంగా గెంతుక పోతూనే వుండడం నా దృష్టిని ఆకర్షించింది. ఆమె ఒక్కర్తే అలా గెంతు తోంది, డయాస్ మీద.

దూడ చచ్చి గేదె పాలు చేపకపోతే చిన్న తమాషా చేస్తారు మీకు తెలుసా? గుండెల్ని పిండేసే హృదయవిదారక మైన తమాషా! ఆ చచ్చిన దూడ చర్మాన్ని గడ్డితో కుక్కేసి గేదె ముందు నిలపెడతారు. అది బిడ్డే అనుకుని నాకేస్తూ పాలు చేపుతుంది గొడ్డు. అది బిడ్డకాదు. ఉత్తి తోలు. లోపల రక్త మాంసాలు లేవు. ఉన్నదంతా ఋష్కమైన గడ్డి. ఆ డయాస్ మీద గెంతుతున్న ఎర్రకిమణిని చూస్తే నాకెందుకో అలా గడ్డి కుక్కిన గేదె దూడ తోలు జ్ఞాపకం వచ్చింది.

"మీదేవూరు?" సుజీ ఇంగ్లీషులో అడిగింది.

మా బావ జవాబు చెప్పాడు

"ఆ అమ్మాయి పేరేంటి" నే నడిగాను డయాస్ మీదనున్న తోలు మనిషిని చూపించి.

"ఏం. మీకు కావాలా?"

అమానుషంగా వినిపించింది ప్రశ్న. జవాబు చెప్పడానికి నాకు తోచలేదు. పరమ అసహ్యంగా కనిపిస్తోంది తోలు పిల్ల. అందువల్ల కూడా ఆమె మీద పవిత్ర భావం కలిగిపోయిందేమో నాలో. ఆడదాని శీలాన్ని ఖచ్చితంగా కాపాడగల ఆయుధాలు రెండే రెండట. ఒకటి. అందం లేకపోవడం; రెండు అవకాశం లేకపోవడం?

"అది కాదు. ఊరికే అడిగాను."

"అంతేగదా? షీలా?" అంది సుజీ.

బేరరు మూడు ప్లేట్లతో 'చౌమీన్' పట్టుకొచ్చాడు. రెండు గోల్డెన్ ఈగిల్ బీర్ బాటిల్స్. ఒక డిప్లమాట్ విస్కీ అరకాయ తీసుకొచ్చి గ్లాసులు సర్దాడు.

షీలా తోలుబొమ్మలాగా గెంతుతూనే వుంది.

"ఆమె అలిసిపోదా?" అడిగాను సుజీని ఈమారు సుజీ వేరుగా నాకు జవాబివ్వకుండా బేరరువైపు తిరిగి చిరునవ్వు నవ్వింది. "ఛట్టీ. పాపం షీలా

అలిసిపోతుందనేమోనని జాలిపడుతున్నారు మా ఫ్రెండ్.'' అంది అతనితో.

చిట్టి అదోలా మొహంపెట్టి నవ్వాడు. నవ్వి ఇక్కడ్నుంచి షీలా వైపుచూశాడు. ఒకవైపు ఒళ్లు ఊపుతూనే షీలా చిట్టి చిరునవ్వుకి జవాబిచ్చింది డయాస్ మీది నుండి.

సుజీ ముడుకుతో నన్ను పొడిచి చిట్టిని చూపిస్తూ "షీలాతో మనవాడికి భలే దోస్తీలేందీ' అంది కన్నింగ్‌గా కన్ను గీటి.

అయ్యో పాపం చిట్టికి పద్దెనిమి దేళ్ళుంటాయా. షీలాకి ఎంత కాదను కున్నా ముప్ఫయ్యారేళ్ళు వుండేవుంటాయి వాళ్ళిద్దరి మధ్య దోస్తీ! ఆ దెబ్బకో విస్కీ అక్కర్లేకుండానే విస్కుయిపోయాను

మా గ్లాసుల్లో డ్రింకులు పోసి వెళ్లాడు చిట్టి

జాగ్రత్తగా మందు పుచ్చుకోసాగాడు మా బావ ఏవో వెదురు గొట్టాల్లాంటి రెండు పుల్లలతో 'చౌమీన్' తీసుకుని నంజుకుంటూ మధ్య మధ్య పానీయం


# ఇంప్‌కాప్స్‌లో సమస్తమూ యంత్రాలచే నిర్వహించబడుతున్నది

## కాగా ఇంప్‌కాప్స్ నికార్సయిన ఆయుర్వేద, సిద్ధ, యునానీ మందులకు పెట్టినది పేరు

దేశీయ వైద్యులు కొందరుచేరి 1944వ సంవత్సరం లోనే సహకార పద్ధతులపైన ఒక ఫార్మశీని స్థాపించారు నికార్సయిన ఆయుర్వేద, సిద్ధ, యునానీ మందులను తయారుచేయడం దేశీయ ఓషధులలో పరిశోధనలు సాగించడం, ప్రాచీన భిషగ్వరుల సూత్రాలను ప్రామాణికం చేయడం ఈ సంస్థ లక్ష్యాలు భవిష్యత్తుపైన పరిపూర్ణ విశ్వాసంతో పురోగమించి, ఇప్పుడు పూర్తిగా అధునాతన పద్ధతులపై యంత్రాలతోనే మందులను తయారు చేయడం సాధించి, ప్రజలకు సేవ జేయడానికి అర్హత సంపాదించుకున్నాము ప్రజలను ఆరోగ్యవంతులుగాను, శక్తిమంతులనుగాను చేసి, దేశాన్ని సౌష్ఠవం చేయడానికి ఇంప్‌కాప్స్ సహాయపడుతున్నది




ది ఇండియన్ మెడికల్ ప్రాక్టీషనర్స్
కో-ఆపరేటివ్ ఫార్మశీ & స్టోర్స్ లిడ్,
లాటిస్ బ్రిడ్జ్ రోడ్, అడయార్ మద్రాసు-20
పెద్ద కెమిస్టులవద్ద, పెద్ద మందుల దుకాణాలలోను లభ్యం కాగలవు

ఇతర ఆఫీసులు తాడేపల్లి పోస్టు, గుంటూరుజిల్లా, ఆంధ్ర ప్రదేశ్
20/320-ఏ, పెదిభొట్లవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ-2
19 వైశ్య హాస్టల్ బిల్డింగ్స్, వీర సావర్కర్ రోడ్డు, హైదరాబాదు-27



maa/IMP/747/M.TEL

గొంతులోంచి గుండెల్లోకి. గుండెల్లోంచి వపాళందాకా కొంచెం కొంచెమే ఎక్కించ సాగాడు.

ముందు నాకు బీరు సయించలా:

అదేంవిటో కుంకుడు పులుసులాగా వుంది.

అదెందుకు తాగుతారు జనం?

మా యావిడ 'సిగరెట్టెందుకు తాగుతారు జనం?' అని నన్ను అడగడం గుర్తొచ్చి. నేనెవర్నీ బీరు సంగతి అడగ లేదు మరి: ఇంతలో వేయించిన జీడి పప్పు ప్లేటులో పరిచి పట్టుకొచ్చాడు చిట్టి. నాకు మహా వంబరమై పోయింది.

ఒక గంట గడిచింది

బారు అదోరకం వాతావరణాని కొచ్చింది.

అందరూ కేరింతలు కొడుతూ కబుర్లాడుకుంటున్నారు.

అమ్మాయిల్తో యాష్లా విలాసంగా సరసాలాడుతున్నారు.

అడపా దడపా మైకు ముందు కెళ్ళి కమ్మటి బూతుపాటలు పాడుతున్నారు. విస్కీ సీసాలు కాళీ అయ్యాక అగ్గిపుల్ల గీసి సీసాగో వేసి. అప్పుడు స్పిరిట్ అంటుకుని పుట్టే చప్పుడు మీద అశ్లీలమైన కథలు తలా ఒకరీతిగా చెప్పడం కొచ్చారు.

నాకు మహాసరదాగా వుంది

నాకు విషా లేదు.

నా చుట్టూ వున్న వాళ్ళంతా వెర్రి పెధవల్లాగా నే నొక్కడ్నే చాలా గొప్ప వాడినై సమున్నతంగా కవిపించసాగాను నాకు. ఈ ఆలోచనే నా కెక్కువ విషాగా వుంది. వాళ్ళదేం విషా:

గానీ వాళ్ళు బాగా విషాలో నేవున్నారు. ఎవరూ అరమరికలు లేకుండా. జంకు గొంకుల్లేకుండా. పసివెధవల్లాగా ప్రవర్తిస్తున్నారు. మందు: ధర్మమాని ఏం గొప్ప మందండీ? మనిషి మెదడు మీద పేరకున్న ఫోరల్ని ఒలిచేసి. 'ఈ వందారము'లుగా యావద్భారు లోకాన్నీ మార్చి పారేసే మహత్తరమైన మందు: వాళ్ళలో నాగరికత లేదు. వజూకు లేదు. కుహనతలేదు. గోపనం లేనే లేదు. బారంతా మత్తుగా వుంది. గమ్మతుగా వుంది.

"పద్దెనిమిదేళ్ళ పిల్లలా వుంది షీలా!" అన్నాడు మా బావ

ఇప్పుడతను శిఖరాగ్రంలో వున్నాడు.

ఎవరయినా చిన్నగా నే కవిపిస్తారు తన కంటే.

సుజీ అతనికి ఒక మెట్టు కిందనుండి అతన్ని కొంచెం కొంచెమే పైకి ఎగదోస్తోంది.

"ఉందా? వుంటుంది:" అంది సుజీ నవ్వుతూ. "గానీ దాని అసలు వయసు నలభై ఏళ్ళు"

"ఈజిట్?" మైకంలో కొన్ని ఇమోషన్లు మోతాదుదాటి కలుగుతూంటాయేమో మా బావ అమితంగా ఆశ్చర్యపోయినట్టు కనిపించాడు. గానీ అంత ఆశ్చర్యం దేనికి? నాకు బోధపళ్ళా ..

"ఆం: షీలాతో మీరు చెప్పండీ. పద్దెనిమిదేళ్ళ దాన్లా వున్నావని? మిమ్మల్ని అమాంతం ప్రేమించేస్తుంది. ఎంచేత

నంటే దాని అసలు వయసు అదే మర్చిపోయింది. పద్దెనిమిదేళ్ళప్పుడు ఈ క్లబ్బులో డాన్సరుగా చేరింది. చేరిన రాత్రి నుండి ప్రతిరాత్రీ ఆ పద్దెనిమిదేళ్ళ వయస్సనే అలవాటు చేసుకుంది. అసలు వయసు ఎలా జ్ఞాపకం వుంటుంది మరి?"

"దట్స్ రైట్! వయసు మనసుతోనే ముడిపడుతుంది!" నేను వాళ్ళ సంభాషణ మధ్యలో కెళ్ళాను. కొంచెం విషా వొచ్చినట్టు నటిస్తే నాకేదో సర్దాగా వున్నట్టు అనిపించింది.

"బట్ ఆ షీలాకంటే సుజీనే బావుంది!" అంటూ మా బావ పెడీమని సుజీ భుజం మీద కొట్టి ఆ వరానా పెరకావులించుకుని దగ్గిరికి లాక్కున్నాడు.

నాకు విషా యెక్కిపోయినా బావుండిపోయేది!

సరిగ్గా ఏమిటీ ఆ బావ చేష్టలు?

'ఉక్కు ముక్కలా వుంది!' తన ధోరణిలో సుజీ శరీరాన్ని సందిట్లో ఒక్కమారు నొక్కేశాడు.

'నో నో నో డాలిన్!' సుజీ మెలికలు తిరిగిపోయింది పాపం.

"షీలా సన్నంగా ఊచపుల్లలా వుంది బట్ అఫ్‌కోర్స్. దేరీజ్ సమ్ డిస్ట్రాయిడ్ బ్యూటీ ఇన్ షీలా టూ" అంటూ కళ్ళు తెరిచి జాగ్రత్తగా ఒకమారు విప్పార్చాడు బావ. జనోద్ధరణ కోసంలాగా చిట్టితో చిరునవ్వులు కుమ్మరిస్తూ కబుర్లు చెపుతోంది షీలా. చిట్టిగాడు సర్వింగ్ వదిలేసి దాని దగ్గరే చతికిల బడ్డాడు. నాకెందుకో చిరాకేసింది.

బేరర్! అరిచాడు మా బావ పాపం బీరు కావాలేమో.

పరిగెత్తు కొచ్చాడు చిట్టి. ఆహా! ఏం కుర్రాడు? ముక్కువచ్చ లారకపోవడమంటారు ఇలాటి వాళ్ళ గూర్చే కావును! ఆ కుర్రాడు చదువుకుంటే ఇంకా హైస్కూలు దాటకూడని వయసు.

'టూ బీర్ బాటిల్స్!' ఆర్డరిచ్చాడు బావ. ఖచ్చితంగా అతనికి బీరే కావాలి. నవ్వుకుని చిట్టి వెళ్ళి, బీర్ బాటిల్స్ తెచ్చి పెట్టాడు.

'కిమ్ పెప్పెంబర్' ట్యూను ఆర్కె


జావిమ్ లోషన్

(...)జ్జ, తామర, దురదలను పోగొట్టును

అన్ని షాపులలోను దొరకును

షాస్త్రివాళ్ళు అందుకోవడంతో మళ్ళా మరో నవచైతన్యపు గాలికెరటం సుడి తిరిగి వేసింది బారుశివాళాలో. కూర్చున్న చోటనే కదలడం ప్రారంభించారు.

అదెలా గుర్తొచ్చిందో గానీ. మా బావకు త్యాగరాజు కీర్తన గుర్తొచ్చింది. ''ఇది చాలా సుఖమా? నన్నిది చాలా సుఖమా?'' అన్న కీర్తనను కొంచెం డిప్లొమాట్ విస్కీలో తడిపేసి, తీసి "ఇది చాలా సుఖమా? నన్నది చాలా సుఖమా?'' అని సుశీలని, షీలాని మార్చి మార్చి చూడసాగాడు కాలితో తాళం వేస్తూ.

అలా చాలా డల్‌గా మొనాటనస్‌గా మరోగంట గడిచిపోయింది. డాన్సింగ్ అవర్స్ గంటకొట్టాడు మానేజరు. ఇప్పుడు చిట్టిగాడు సర్వింగ్ డ్యూటీనుండి రిలీజయాడు. వాడు ఆ క్లబ్‌లో ఉద్యోగుడైన డాన్సరట. షీలాతో కలిసి ట్విస్టు చెయ్య సాగాడు.

ఈలలు. కేకలతో బారు హోరెత్తిపోతోంది.

''కాంబినేషన్ బాలేదు" అన్నాను నేను.

''గానీ డాన్స్ బావుంది'' బావ చప్పరించాడు.

అందరి దృష్టి డయాస్ మీదనేవుంది. చిట్టి మహా అద్భుతంగా మెలికలు తిప్పేస్తున్నాడు తన పద్దెనిమిదేళ్ళ వయస్సును. ఇంద్రజాలం చేసేస్తున్నాడు. వాడు ఇమోషనొచ్చి ''హయ్యా!'' అని షీలా



తొడల మీద గిలకొడితే బారంతా కర్రెత్తిపోయి అరుస్తున్నారు

''వండ్రఫూల్! వండ్రఫుల్. చిట్టీ కమ్‌హియర్.'' చిట్టిని డయాస్ మీది నుండి కిందికి రమ్మని పిల్చాడొక 'రస' జ్ఞుడు. ట్విస్టుతోనే అడుగులేస్తూ ఆ పిల్చిన చోటికెళ్ళాడు చిట్టి.

"హావ్ దిస్!'' అంటూ ఉదారంగా చేతిలోని విస్కీ గ్లాసును చిట్టి కందించాడు రసజ్ఞుడు.

''నోథేంక్స్."

''నో, హేవ్!''

మొగమాటంగా షీలా వైపు తిరిగి చూశాడు చిట్టి. షీలా మత్తుగా ఊగుతూనే ఒద్దని సైగ జేసిందొక పక్క. చిట్టి తిరిగి 'రసజ్ఞుని వైపు తల తిప్పి ''సారీ సార్!'' అన్నాడు. అప్పో చిట్టి

గాడు మహాపతివ్రతుడిలాగా వున్నాడు.

"వాట్! షీలా ఒద్దంటే నువ్వు మానెయ్యాలా? తాగితే తలతీసి మొలే స్తుందా? నీకు వందమంది షీలాల్ని తూచన్న పళానా కన్యాదానం చేస్తాను. తాగు .." అంటూ చిట్టిమాట వినిపించు కోకుండా చొరవగా వాడిభుజం పట్టుకుని సోఫామీకికి లాగి గొంతులో పోశా డతను

గెంజాకు టునే పావం తాగేశాడు చిట్టి.

"దట్సిట్! నా. గో ఆన్! డాన్స్!!" ఆవి డయాస్‌మీదికి తోసేశాడు మందు దాత.

మరో పావుగంటలో చిట్టికి అందు కుంది. ఇంతసేపూ డేన్స్ మాత్రమే చేసినవాడు ఇప్పుడు పాటకూడా లంకించు కున్నాడు.

"హౌస్ ఆఫ్ బాంబూ " అంటూ గిర్రిగ్గిర తిరిగిపోతూ షీలాని తిప్పేస్తూ డయాస్ అంచుల్ని దాటిపోయాడు.

మందిచ్చిన మహోదాతుడి ఉదాహర ణని అనుసరించారు మిగతా బారువా రంతా! చిట్టి వృష్ఠం ఆవించిన ప్రతీ టేబిలుకాడా. కష్టమర్లు వెనక్కి వంచేపి హేలగా బ్రాండీలు. విస్కీలు. షాం పేన్‌లు, కాక్కోకోలాలూ-నాగుల చవితి నాడు పుట్టలో నానాపదార్థాలు పోసేసి నట్టే చిట్టిగాడి పొట్టలో నానామందులూ పోసేయసాగారు. అవన్నీ తీరా కడుపు లోని కెళ్ళాకా కాక్‌టెయిల్లై పోయాయి.

"కమియర్!"

"చిట్టీ, హియర్!"

"హావ్ దిస్ పెగ్!"

"టసీజ్ స్కాచ్!"

"ఇఫ్ ఇటీజ్ స్కాచ్ డోంట్‌వేస్ ఇట్."

"అండ్ సిమిలాలీ, ఇఫ్ ఇటీజ్ వుమన్, డోంట్‌వేస్ ఇట్!"

తద్వారా 'అడు' దానిమీదికి బాకు దృష్టంతా ఒక్కమారు మళ్ళిపోయింది. షీలా మరబొమ్మలాగా ఆడుతోంది. కళ్ళు తిరగపోయేమో! అనలిలత కంగాళీ జరక్కపోయేది మరోమారైతే? గానీ ఈరోజు జనతారావుగారి పుట్టింరోజు. నాకర్మ కాలిన్రోజు. అంచేత ఆయొక్క మేనేజరుకూడా డిల్‌గా మందుకొట్టేసి ప్రజానీకంలో కలిసిపోయాడు

చిట్టిగాడికి కళ్ళు తిరిగి పోతున్నట్టు న్నాయి. అవి కళ్ళా? కావు! గాజు కాయలు. గాజు విస్కీకాయలు! పడి పోతున్నాడు. కానీ తీస్తున్నాడు. మందు స్వయంగా టేబిల్స్‌మీదనుంచి తీసుకుని తాగేయడం ప్రారంభించాడు.

షీలా వారిస్తోంది. కానీ ఎవరూ గమ నించడంలేదు.

దేవదాసులో 'అమ్మి' కన్యాశుల్కంలో 'మధురవాణి.' శాంతినివాసంలో 'కృష్ణ కుమారి' - వంటిపాత్రలు నాకు గుర్తొస్తు న్నాయి షీలాను చూస్తే. సిన్సియర్‌గా చిట్టిగాడ్ని ప్రేమిస్తూన్నది కాకపోతే, వాడెలా తాగితే దానికేం? ఎలా తైతక్క లాడితే దానికేం? మదరలవ్వు వెలిగ బెడుతోంది మంఠ!........

ఆ లవ్వు చూడ్డానికి బాగులేకపోయినా పాపం వాళ్ళవీ మనసులే ..!!

చిట్టికి కిక్కొచ్చి చాలా సేపైయింది. ఐనా తాగడం ఆపలేదు. అంచేత కిక్కు తారాస్థాయి నందుకుంటోంది కస్టమర్స్ని "వాట్ బ్రదర్‌ల్లా!" అంటూ భుజం తట్టేసి పలకరించేస్తున్నాడు. ఆమూలా ఈమూలావున్న ఆడజూలాయికిరాయి పిల్లల్ని అపళంగా రెక్కపట్టిలాగి తనతో డాన్స్ చేయించుకుంటున్నాడు. వాళ్ళు అప్పటికే ఎవరెవరితోనో ఎంగేజ్ అయి పోయినందువల్ల జాగ్రత్తగా చిట్టిబారి నుండి తప్పించుకుంటున్నారు. అప్పుడిక మరి గతిలేనట్టు మళ్ళా షీలా నడుమే పట్టుకుని తూగసాగాడు చిట్టి.

"నొ. లెటజ్ హేవ్ సమ్‌ఫన్!" అన్నాడొక ఫన్ మాస్టరు. అదంతా ఫన్ కాదేమో అతగాడికి! ఇంకేదో గమ్మత్తు చెయ్యాలని పించింది. మహాకాయాన్ని కుర్చీలోంచి లేపి వెళ్ళి చిట్టిగాడి చెవిలో ఏదో ఊదాడు. చిట్టి నవ్వాడు. పక పక పకమని అయిదు నిమషాలు ఆగకుండా నవ్వాడు.

"ఓకే!" అడిగాడు మహాకాయం.

"ఓకే!" అంటూ షీలానిచూసి కన్ను కొట్టాడు చిట్టి.

చిట్టి కళ్ళనిండా దాహం!

మొహమంతా మోహం!!

తలనిండా వికారించిన పైత్యం! మైకం...

స్పష్టంగా కనిపిస్తున్నాయి వాకు.

(వాకు సిషా లేదు!)

అలా మరో పది నిమషాలు గడవక ముందే ఒక పెద్ద గావుకేకవేసింది షీలా! బాంబులు పడినంత కోలాహలంగా జనం నవ్వారు. తుళ్ళిపోయి నవ్వారు. చిట్టి గాడు ఒకచేతిలో షీలాని అలాగే పట్టు కుని మరోచేత్తో ఫన్‌మాస్టరందించిన మందుగ్లాసు ఖాళీ చేస్తున్నాడు. ఖాళీ చేస్తూ. నవ్వి. పొలమారి దగ్గి. నవ్వి మళ్ళా ఖాళీ చేసేస్తున్నాడు.

మరేం కాదు!

డాన్స్ చేస్తున్న షీలాని వెనక మారుగా సమీపించి. ఒంటిమీదనున్న ఒక్కగా నొక్క బాడీని విప్పి పారే శాడు చిట్టిగాడు. అది, బారు కోలా హలానికి కారణం!

"నో! నో! వదిలేయ్. చిట్టీ .నన్నొ దులు " అంది షీలా అచ్చమైన తెలు గులో

"నో! నో " తల అడ్డంగా తిప్పాడు చిట్టి.

"నొ దిస్కర్ట్!" లంగా వైపు చూపించి అనౌన్స్ చేశాడు శ్రీమాన్ ఫన్ మాస్టరు.

బారు జనం అంతా ఒక్కమారు ఆసక్తి పుంజుకుని అటువైపు తిరిగిపోయి చూడసాగారు.

"నో ..." అంటూ గోలపెట్టేసింది షీలా.. పెనుగు లాడింది. చిట్టిబారినుంచి ఒదిలించుకోవాలని చూసింది.

"డోంట్‌వరీ షీలా! తమాషాకోసం! అంతే! ' ఫన్‌మాస్టరు మహాకాయం షీలాకి హామీఇచ్చారు.



నాణ్యతగల వస్త్రాలు ?

హార్వే

# ట్విన్ టస్కర్

డ్రిల్‌లు • పాప్లిన్‌లు • గాబర్డీన్‌లు మొదలైనవి






మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై

Bensons-1335 A TEL

జాగ్రత్తగా చిట్టి చేతులు షీలా కడుపు మీద పాకాయి.

అంతసేపూ సిగ్గుపడుతూన్నట్టు కని పిస్తున్న షీలా ఇప్పుడు కంగారు పడిపో యింది. ఏమో ఒంటినిండా గజ్జి, తామరా వున్నాయేమో! పల్లిగ్గా బంగారం బయట పడటం-ఎంత తాగిన వాళ్లు ముందైనా సరే. నామోషీగదా! ఆడదాని అందం ఆ పాటి చాటుమాటుగానే వుంటే ఆకర్షణ!

"చిట్టీ ఒదిలేయ్!" కంగారుగానే బ్రతిమాలింది.

"ఒద్దల్నా..." ఫర్మ్‌గా జవాబు చెప్పాడు! విషాలో కళ్ళు పేలిపోతూన్న చిట్టి చెప్పి చేతుల్ని స్కర్ట్‌మీదికి పోని చ్చాడు. అంతసేపూ గుండెలమీద రెండు చేతుల్తోనూ కప్పుకున్నదల్లా, ఇక చిట్టి ఆగడం మరి ఆగక పోవడం చూసి-రెండు చేతులూ తీసేసి చిట్టి మెడమీద బలంగా వేసి వెనక్కి తోసేసింది. చిట్టి వెల్లకిలా నేలమీద పడిపోయాడు.

మరోమారు ఫకాలుమన్నారు జన మంతా.

చిట్టికి ఉక్రోష మొచ్చింది. కోపంగా లేచాడు

"నేయ్....ఉసే .. నీ పన్సరే...."

అంటూ తూలాడు.

వాడి కళ్ళలోని ఉద్రేకం గమనించింది షీలా. ఒకచే పరుగున బారులోంచి బైటికి దూకింది. దాని వెనక చిట్టిగాడు పరిగెత్తాడు.

పొలోమని అరిచి గలభా చేస్తూ బారు జనాభా అంతా చిట్టిని వెంబడించారు.

నాకు కూడా ఆసక్తి కలిగింది.

ఏం జరుగుతుందో చూడాలని....

ఈసరికి మా బావ సుజీతో మరో లోకంలో వీర విహారం చేస్తున్నాడు. అతన్ని అలాగే వదిలేసి నేను వాళ్ళ వెంట పరిగెత్తాను.

బారు పెరట్లో నుండి పది గజాలు ఉత్తి ఆరుబయలు. అక్కడినుండి డాబా మీదికి మెట్లు వెన్నెల వచ్చగా. చల్లగా పరచుకునుంది. అల్లర్లు భరించలేని ప్రశాంతమైన వెన్నెల.

డాబా చివరి మెట్టుమీద నిల్చుంది షీలా.

పైకి పోతున్నాడింకా చిట్టి.

"చిట్టీ అక్కడే నిలబడు. మీదికి రాకు. చంపేస్తాను. పైకొస్తే చంపే స్తాను" షీలా హెచ్చరిస్తోంది.

"పైకెళ్ళినా కింది కొచ్చినా నిన్ను చంపేస్తాను." అంటూ పడుతూ లేస్తూ వెళుతున్నాడు చిట్టి.

కిందనే నిలబడి తమాషా చూస్తు న్నారు మా వాళ్ళు

చిట్టిని హుషార్ చేస్తున్నారు ఈలలు వేస్తూ.

డాబా ఎక్కిపోయాడు చిట్టి.

జోగుతూ తూగుతూ షీలా మీద పడ్డాడు కరిచింది. గిచ్చింది. అరిచింది. కేకలు వేసింది.

కింద పోగైన మాలో ఒక్కడు కదిలితే ఒట్టు.

సినిమా చూస్తున్నట్టు చూస్తున్నారు. చిట్టి షీలాని కింద పడగొట్టాడు.

షీలా లెంపలు పగలగొట్టేసింది.

మనలో మన మాట. నాకు షీలా మరీ అంత పాతివ్రత్యం వెలగబెట్టవక్కర్లేదనిపించింది. ఎలాగా తన వృత్తి కిరాయి వృత్తేగదా! ఏదో ఈ షాలో వున్న కుర్రాడు అందులో బాగా స్నేహమున్న కుర్రాడు ముచ్చటపడి దగ్గరకొస్తే ఇంత రాద్ధాంతము చెయ్యాలా? అక్కర్లేదు. అందుకేనేమో మా వాళ్ళకి మరీ వుక్రోష మొచ్చింది. చిట్టిని సపోర్టు చేస్తూ కూతలు పెడుతున్నారు కిందమంది.

ఏం జరిగిందో తెలీదు!

గాపీ దభేలుమని డాబా మీది నుండి కింద పడిపోయాడు చిట్టి!

నా చుట్టూ వున్న జనం కాకుల్లాగా పారిపోయా రెక్కడికో.

చిట్టి చుట్టూ రక్తం మడుగు కట్టేస్తోంది.

దెయ్యంలాగా కిందికి దిగుతోంది షీలా!

??!! చదివారా !!??

భామిని
భామిని
భామిని

సచిత్ర కథల మాస పత్రిక

విడిప్రతి రూ 1/- సం॥ చందా రూ 10/-
అర్ధ సం॥ చందా రూ 5-50
ఏజంట్లు లేని చోట్ల ఏజంట్లు కావాలి

భామిని 24 దామోదరరెడ్డి స్ట్రీట్, మద్రాసు-17 ఫోన్ నెం. 442984

"చిట్టీ...!" గావుకేక వేసింది షీలా!

"నాన్నా చిట్టీ..." చీకట్లో దిక్కులు ఒక్కు విదుల్చుకున్నంత గట్టిగా పిల్చింది చిట్టిని.

పిచ్చిదానిలాగా పరుగు పరుగున మెట్లు దిగి చిట్టిని కావులించుకుని తల బాదుకో సాగింది.

నాకు కోపం వచ్చింది.

"బుద్ధిలేదా! మెట్లమీదినుంచి తోసేసి పళ్ళు యేడస్తావేం? వంగనాచి వేషాలు!" అని కసిరాను. నన్ను అప్పుడే చూసింది షీలా. మరింత బావురుమంది.

"బాబూ! లేదు బాబూ! నేను తొయ్యలేదు బాబూ! ఇంతపని జరుగుతుందని తెలిస్తే లొంగిపోయేదాన్ని తండ్రీ! నా కన్న కొడుకు ప్రాణం కంటేనా నా ఒళ్ళు? కుళ్ళు ఒళ్ళు. పాడు ఒళ్ళు. నా బాబుకంటేనా? వాడే కాలుజారిపోయి కింద పడ్డాడు తండ్రీ. వాడ్ని చంపుకోడానికయితే యిప్పుడా బాబూ? చైర్మను బాబు నకుగా చేసిన్నాడే కడుపులోనే చంపేసుందేదాన్ని కానా? ఇతగాడి బార్లో ఇలా ఒళ్ళమ్ముకుని బ్రతికిందంతా ఇందుకా? కాదు! నా కొడుకు కోసమే వాడిచేత తాగించేశారు మీరంతా. వాడికి ఒళ్ళు పైకపబడింది కాదు. నా మీద పడబోయాడు. ఎంత చెడిన దాన్నయినా వీడు నా కొడుకు..." గొల్లుమంది షీలా.

మహా నిశ్శబ్దంగా వుంది ప్రపంచం.

ఒక షీలా మాత్రమే ఘోరంగా యేడుస్తోంది. ●

# నాలుగు సిగరెట్ల కథ

ఎ. శ్రీధర్

'రాయపూర్ పాసింజర్' పావు గంట క్రితమే వెళ్ళిపోయిందట.

పార్వతీపురం "టౌన్" స్టేషన్‌కి చేరుకొనే సరికి, ఎదురయిన వర్తమానం అది.

"వెధవ బస్సులు," గట్టిగానే తిట్టుకొన్నాను. టైముకి సరిగా వచ్చిచావవు అయినా తోటపల్లి ఆనకట్ట దగ్గిర ఈ బస్సుకోసం పడిగాపులు పడటం కంటె, రిక్షా మీద పార్వతీపురం చేరుకొని ఉంటే పాసింజర్ బండి దొరికి ఉండేదేమో!

ఇప్పుడేమనుకొనీ లాభం లేదు తెల్లవారే దాకా, ఎలాగో అలా కాలం గడపక తప్పదు తిరిగి ఇంటికి వెళ్లడం అనేది జరగని పని. నా దురదృష్టానికి నిందించుకొంటూ నవరత్నా టాకీస్' వైపుగా దారి తీశాను.

భక్త అంబరీష కాబోలు ఆడుతోంది. చూసినదే అయినా, 'టైమ్-కిల్లింగ్'కి అంతకన్నా మరో సాధనం లేక బుకింగ్ దగ్గరికి వెళ్ళాను. బుకింగ్ యింకా తెరవ లేదు.' సెకండ్‌షో' ఆడడానికి చాల వ్యవధి ఉంది.

దగ్గర్లోనే ఉన్న టీ దుకాణం బెంచీ మీద కూర్చొని, 'చా'కి ఆర్డరిచ్చి నాలుగు ప్రక్కలా కలయ జూసాను.

ఇంచు మించు మూడు నాలుగు గజాల దూరం ఉంటుంది నవరత్నా టాకీస్ గోడ మలుపులో, మ్యునిసిపాలిటీ దీపం క్రీనీడలో నాలుగు సిగరెట్లు వెలుగుతున్నాయి.

గుప్పు గుప్పుమని పొగ వదులుతూ, చీట్లపేక కాబోలు ఆ క్రీనీడలోనే ఆడుతున్నారు వాళ్ళు

'ఎవరో రౌడీ వెధవలు!' అన్న భావన కలగగానే అప్రయత్నంగా నా చేతి సంచీ, మనీపర్సు తడవి చూసుకొని అటువైపు దృష్టి మరల్చుకున్నాను.

కాని ఏదో తెలియని కుతూహలం నాలో అంతర్గతమై మాటి మాటికి నన్ను అవైపు చూసేలా ప్రోత్సహించింది

ఆ వ్యక్తులెవరో తెలియని కారణం చేత వాళ్ళు అదే పనిగా, ఒకదాని వెనుక ఒకటిగా సిగరెట్లు కాల్చడంచేత నేను వాళ్ళని సిగరెట్లు క్రిందనే జమకట్టాను.

నా దృష్టికి ఎదురుగా మొదటి సిగరెట్టు ఉందనుకొంటే అక్కడ నుండి కుడిచేతి వరుసగా రెండు, మూడు, నాలుగు ఉన్నాయన వచ్చు

సిగరెట్టు గట్టిగా లోపలికి పీలుస్తున్నప్పుడు, కలిగే వెలుగువల్ల వాళ్ళ ముఖాలు క్షణ క్షణానికీ కనిపిస్తున్నా, మ్యునిసి

పాలిటీ లైటు వెలుగు ఒక ప్రక్కగా పడడంవల్ల నాలుగో వ్యక్తి ముఖం మాత్రం స్పష్టంగా కనిపించింది.

మిగిలిన ముగ్గురి కంటె అతని ముఖం లేతగా, రీవిగా కూడా ఉంది. పొరపాటున ఆ గుంపులో చేరినట్లు ఉంది గాని, వాళ్ళల్లో ఒకనిగా మాత్రం లేదు ఎందుకో ఆ కుర్రాడి మీద జాలి ముంచుకొచ్చింది నాలో

వాళ్ళ మధ్యనుండి అతనిని పైకి లాగి, ఉద్ధరించేయాలని కోరిక పుట్టింది

వాళ్ళు చీట్లు ఆడుతూనే ఏవేవో మాట్లాడేస్తున్నారు. ఒక విషయం మీద మాటలు కావవి. నాటకాల మీద, సినిమాల, మీద కోడి పందాల మీద, చిన్న చిన్న రన్నింగ్ కామెంటరీల లాగ మొదలయి, చివరకి ఆడవాళ్ళ మీద చర్చ మొదలయింది.

ఆడవాళ్ళలో చర్చ 'బూతులతో'గాని మొదలవదేమో మరి! అవిరళంగా బూతులు మాట్లాడేస్తూ, అతని ముఖం వంక చూస్తున్నారు వాళ్ళు ఆ నాలుగో వ్యక్తికి ఆ మాటలు ఇష్టం లేదులా ఉంది. అతను మాటి మాటికీ, వాళ్ళ మీద నుండి చూపులు నేల మీదకీ, పేక ముక్కల మీదకి, పరిసరాల మీదకి మారుస్తున్నాడు.

"ఒరే సూర్యం! ఆపరా గొడవ! పంతులకి మన మాటలు ఇష్టం లేనట్టుంది!" అందులో అన్నాడు ఒకడు. సిగరెట్టు గట్టిగా నేలకేసి విసురుతూ.

మొదటి సిగరెట్టు, 'అదే సూర్యం!' జవాబుగా, వెకిలిగా నవ్వాడు, "ఆ! ఇప్పట్లో ఇష్టం ఉండదులే" అంటూ.

ఇంతలో బుకింగ్ తెరచినట్లుంది. టీ స్టాల్ దగ్గర, ఇంకా చుట్టుపట్ల ఉన్న జనం ఒక్కసారి హడావుడిగా బుకింగ్ చుట్టు ముట్టారు.

వాళ్ళని చూసి నేనూ లేచాను. వాళ్ళు కూడ సందడి గమనించినట్టుంది. పేక ముక్కలు జేబులో దోపి, సిగరెట్లు కసిగా నేలకేసి విసిరి, బుకింగ్ దగ్గరికి వెళ్ళారు.

అప్పుడే వాళ్ళని బాగా చూడటం జరిగింది. సూర్యం! వాళ్ళ 'రింగ్ లీడర్' కాబోలు! నల్లగా ఉన్నా ఆకర్షకంగా ఉన్నాడు. అంతే ఆ ఆకర్షణలో జులాయి తనకు హెచ్చుగా ఉంది.

మిగతా ఇద్దరూ ఇంచు మించు సూర్యం లాంటి ఒడ్డూ పొడుగుతో, అతనికన్న కొంచెం ఎక్కువ మొరటుగా ఉన్నారు.

పాపం! నాలుగో వాడు పంతులు. వాళ్ళ వెనుక బిడియపడుతూ, వధ్య స్థానానికి తీసుకుపోటున్న మేకలా వాళ్ళ వెంట కనిపించాడు.

ఒకసారి చూసిన సినిమాకి, ఇంత కంటె ఖర్చు ఎందుకనో, వాళ్ళ గురించి ఇంకా ఎక్కువ తెలుసుకోవాలన్న కుతూహలం వల్లనో ఏదయితేనేం! పావలాకి నేల టిక్కెట్టు కొని వాళ్ళ వెంట లోపలికి నడిచాను.

అయితే 'నేల' అంటే ఉత్తనేల మాత్రమే అని అనుకోలేదు. నేల కూడా ఆడిటోరియంగా ఉన్న సినిమా టాకీసులు ఇదివరకు చూడనూలేదు. ఇంటర్వెల్‌కోసం ఎదురు చూసి, అది కాస్తా అవగానే ఎవరి




కంటా పడకుండా ఖాళీగా వున్న కుర్చీలలో ఒకదాన్ని ఆశ్రయించాను

సినిమా అయిన తరువాత నాకు వాళ్ళు జ్ఞాపకం రాలేదు. అక్కడ నుండి నేరుగా 'టౌన్' స్టేషనుకి మైలున్నర దూరంలో వున్న 'బెల్గాం' స్టేషన్ చేరుకోవాలని, తొందరగా నడక సాగించాను ఆ తొందరలో వాళ్ళని గురించి పట్టించుకునే అవకాశమే లేకపోయింది.

అది అంతటితో ఆగిపోయినట్లయితే, ఆ సంఘటనకి నా జీవితంలో పెద్ద ప్రాముఖ్యత ఉండేది కాదు.

మరి రెండేళ్ళ తరువాత, ఖరగ్‌పూర్ వర్క్‌షాపులో, హైడ్రాలిక్ పంపింగ్ మిషన్‌దగ్గర ఆసంఘటనని దాదాపు మరచిపోయిన నాకు, అకస్మాత్తుగా వంతుల కనిపించాడు.

అతనేనా! అన్న అనుమానం కలి

గివా. వలకరి స్తే ఏం పోయిందన్న ఉద్దే శంతో దగ్గరికి వెళ్ళి నిలబడ్డాను.

మిషన్‌కి ఆయిలింగ్ చేసి. చేతులు తుడుచుకొంటూ, నావైపు చూచాడు పంతులు. 'ఏం కావాలి?' అన్నట్లు.

నే నెవరో తెలియలేదన్న సంగతి అతని ముఖమే చెప్తోంది. అయినా అం దులో ఆశ్చర్య పడాల్సింది ఏమీలేదు. 'ఆ రోజు, అతను నన్ను రెప్పపాటు కాలమైనా గమనించి ఉంటాడంటే నేను నమ్మను

మాటలు ఎలా మొదలెట్టాలో తెలి యక మొదలెట్టాను మిమ్మ ల్ని ఎక్కడో చూసినట్లుంది", అంటూ

అతను నిర్లక్ష్యంగా నవ్వాడు. "ఎక్కడో ఎందుకు? పాటుక్ బజారులోనో ఖరీవాలోనో, విఁహూహావర్క్‌మెన్స్ట్రెయిన్ లోనో చూసి ఉంటారు." అంటూ

"అదికాదు! పార్వతీపురంలో "

క్షణంసేపు నావైపు వింతగా చూసాడు అతను. 'మీది.. మీది పార్వతీపురమా?"

"కాదు!" నెమ్మదిగా అన్నాను పార్వతీపురానికి దగ్గరిగా నుంకె అగ్ర హారంలో మా మామయ్య ఉండేవారు విజయనగరంలో చదువుకొనే రోజులలో సెలవులకి అక్కడికి వెళ్తూ ఉండేవాడిని."

"నాగావళి నదికి ఇవతల పక్క మీ మామయ్యగారి ఊరు అయితే, అవతల ప్రక్కదే మా ఊరు టౌన్‌తో అవ సరం వచ్చినప్పుడల్లా పార్వతీపురం వెళ్ళడం. ఆ చుట్టుప్రక్కల వాళ్ళకి అలవాటే. మీరు నన్ను అక్కడే చూసి ఉంటారు." మధ్యలోనే అందుకొని పూర్తిచేసాడు అతను.

ఎంత తేలికగా, ఎంత నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు. తెలివితేటలతోపాటు, పెంకి తనంకూడ నిండుగా ఉన్నదన్నమాట.

"మరి వాళ్ళందరూ ఏమయ్యారు? అదే మీ ఫ్రెండ్స్ "

'వాళ్ళు!' ఆశ్చర్యంతో నా వైపు చూసాడు పంతులు, "వాళ్ళు ఎవరు? "

"అదే! సూర్యం......"

"సూర్యం మీకు ఎలా తెలుసు" సాధ్యమైనంత గట్టిగా అన్నాడతను. అతని కంఠంలో కోపంకూడా ధ్వనిం చింది.

చెప్పాను. ఆ సంఘటన కాకతాళీ యమే అయినా, దానివల్ల పంతులు పట్ల, ఎందుకో తెలియని ఆప్యాయత ఇన్నా ళ్ళుగా నా మనసులో మరుగున ఉన్నదన్న విషయం నాకు అప్పుడే తెలిసింది అందు వల్లనే కాబోలు, దాపరికం లేకుండా, నేను చూసినవి చూసినట్లు, అనుకొన్నది అనుకొన్నట్లు చెప్పాను

పంతులు బిత్తరపోయి నా వంక చూస్తూ ఉండిపోయాడు. అతని మనస్సు ద్రవించి పోయింది

"నిజమేనండి! మీరు చెప్పినదంతా నిజమే! ఆ సూర్యం! మోసంచేసాడు! మోసం! అంతే కాదు ఆ మోసంలో నన్నూ మా కుటుంబాన్నే పావులుగా వాడుకొన్నాడు.

'ఏం జరిగింది, ఏమిటా మోసం' అని




నేను అడగ దల్చుకోలేదు. అతనే చెప్తాడని మౌనంగా ఎదురుచూడ సాగాను.

“వాడిదృష్టి మా అక్కయ్యమీద పడింది. వాళ్ళిద్దరికీ. పరిచయం ఎప్పుడు ఎలా జరిగిందో మాకెవరికీ తెలియదు. పోతే ఆ పరిచయాన్ని పెంచుకోడానికే నన్ను సాధనంగా చేసుకొన్నాడు. అక్కయ్య సిగరెట్ పెట్టెలతో రకరకాల బొమ్మలు తయారుచేసేది. దానికి కావలసిన ఖాళీపెట్టెలు. ‘మేము కాల్చినవే’ సూర్యం నాద్వారా ఇస్తూండేవాడు. అందులో ‘ప్రేమలేఖలు’ ఉండేవన్న సంగతి నాకు ఏమాత్రం తెలిసేది కాదు. నాకు తెలియకుండానే నేను వాళ్ళ పరిచయానికి నీరు పోసాను. అప్పుడప్పుడు సాయంత్రంవేళ. బిందె తీసుకొని ఏటికి వెళ్ళేది అక్కయ్య. నన్నే సాయంగా తీసుకొని నీళ్ళుముంచి. ‘ఇప్పుడే చటుటికి వెళ్ళి వస్తానని చెప్పి. తోటలోపలికి. చీకటి గుబురుల్లోకి వెళ్ళిపోయేది. నేను అదే అవకాశంగా తీసుకొని, అంతకు ముందే సూర్యం ఇచ్చిన సిగరెట్లు కాలుస్తూ ఏటిగట్టునే కూర్చొనేవాడిని. అక్కయ్య ఎప్పుడు వచ్చేదో తెలిసేది కాదు. ఆ తరువాత ఇద్దరం కలిసి, ఇంటికి చేరుకొనేవాళ్ళం.......” పంప్‌మిషన్ కేసి చూస్తూ దీర్ఘంగా నిట్టూర్చాడు పంతులు.

అక్కడఉన్న రెండు పంప్ మిషన్లు ఒకదాని తరువాత ఒకటి పనిచేస్తూ ఉంటాయి. ఆరూమ్‌కి ప్రక్కనే ఎత్తయిన స్తంభాలమీద రెండున్నర అడుగుల వర్తులంగా ఉన్న పెద్ద సిలిండర్ ఒకటి ఉంది. ఈ పంపులద్వారా తోడివేయబడిన నీరు ఆ సిలిండర్ అడుగుభాగానికి

చేరుతుంది. అదేసమయానికి, ఆ సిలిండర్, దాని సహజమైన బరువుతో నీటిని నెట్టుకొంటూ క్రిందికి దిగుతుంది. అడుగున ఉన్న నీటిమీద చాల హెచ్చు స్థాయిలో ఒత్తిడి కలగడంవల్ల, ఆ నీటికి పీడనశక్తి ఎక్కువగా ఉంటుంది. ఆ నీటిని గొట్టాలద్వారా తీసుకుపోయి, బరువైన 'హైడ్రాలిక్ ప్రెస్' మిషన్'లు, "పవర్ హేమర్'లు నడుపుతూ వుంటారు. ఆ పంపింగ్ మిషన్‌కి అటెండర్‌గా పని


ఆరోగ్య అనారోగ్య
పరిస్థితులలో మహిళలు
ఆరోగ్య
సౌభాగ్యములకు
వాడదగినది
లోధ్ర
అనేక సంవత్సరముల నుండి
ప్రసిద్ధిపొందినది
కేసరి కుటీరం
(ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట మద్రాసు 14
ఏజెంట్లు:


చేస్తున్నాడు అతను. మామూలు ఉద్యోగం అన్నీకలిపి నూట ఇరవైకన్న ఎక్కువ దొరకదు. అదికూడా పర్మనెంటుకాదు. నమ్మకంగా పనిచేస్తే, ఉద్యోగం ఖాయం కావచ్చు.

నిజానికి, ఆ మిషన్‌కి మనిషి అవసరం లేదు. దానికి నడపడానికి, అవ దానికి తప్పిస్తే అయితే 24 గంటలు మూడు షిఫ్టులలో అక్కడ ఎవరో ఒకరు ఉంటారు. అనుకోని ప్రమాదం ఏమయినా జరిగినట్లయితే, మిషన్ నిలిపి, ఫోన్ ద్వారా రిపేర్ పనివాళ్ళని పిలవడం మాత్రమే అటెండర్ చేసేపని. అందుకే చాల తీరిక పంతులుకు ఎవరూ వచ్చి చూస్తారన్న భయం లేకపోవడంవల్ల హాయిగా కూర్చొని, పుస్తకాలు చదువుతూ, గంటలకొలదీకాలం గడిపేయవచ్చు.

పంతులు మిషన్‌వంక చూస్తూ ఉండిపోయాడు. నేనుకూడా అటువైపు దృష్టి మరల్చాను. మిషన్లు రెండూ వాటిపని అవి చేసుకొంటూ పోతున్నాయి. బహుశా మనుషులలో ఉండేదగా, మోసం వాటికి తెలియదేమో!

'తరువాత ఏం జరిగింది?' మౌనాన్ని భరించలేక అడిగాను

"ఏం జరుగుతుంది! జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించాడు పంతులు. తరువాత దాన్ని కసిగా అవతల-గిరాటేసి," దాని రంకు-కాస్తా బయటపడింది. అది ఎవరో-మా నాన్నగారికి తెలిసిన

ఆయన కంట పడడం. అతను మా నాన్నగారికి మాత్రమే తెలియజేయడం జరిగింది. గ్రామంలో-అంత మందికీ, చూచాయగా తెలిసినా. ఎదురుగా అనడానికి-ఎవరూ సాహసించలేదు మా నాన్నగారు మాత్రం నెత్తీ-నోరూ బాదుకొని. మా అక్కను తీసుకొని. విజయనగరం వెళ్ళారు. అక్కడ మా బాబాగారి భగీరథ ప్రయత్నంవల్ల దాని పెళ్ళి-కూడా జరిగిపోయింది '

"మంచిదే!" భయపడుతూ నే అన్నాను. "ఒక్క - పొరపాటువల్ల జీవితం నాశనం కాకుండా మంచి పనే-చేసారు మీ నాన్నగారు "

"హాం! ఏం మంచి పుస్తైపడిన షరు తణంలోనే ముగ్గురి పిల్లలకి తల్లి కావలసి వచ్చింది"

ఒక్క క్షణం అర్థంకాక విభ్రాంతున్నయ్యాను. పంతులు-మాటలు బరువుగా వినిపించాయి. 'రెండో పెళ్ళి సంబంధం అన్నమాట. నిజమే! తొందరలో మంచి సంబంధం ఎలా-తేగలరు అనుకొన్నాను' మనసులో.

కిటికీ అద్దాలగుండా బయటకు చూస్తున్న పంతులు.ఉన్నట్లుండి, ఒక్కసారిగా లేచి నిలబడ్డాడు. "మీరిక్కడే కాసేపు-కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అంటూ.

"ఎక్కడికి?"

'ఇలా రండి!" దగ్గరకి పిలిచాడు పంతులు. అతనిని అనుసరించి కిటికీగుండా బయటకి చూసాను. 'బ్లాక్‌స్మిత్' షాపు మలుపు దగ్గర, ఒక వ్యక్తి నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్నాడు. అతనిని చూపిస్తూ అన్నాడు పంతులు.

"చూసారా!" సూర్యం లాగేఉన్నాడు. నేను వెళ్ళిచూసి వస్తాను. నిజంగా సూర్యమే అయితే ." కోపంతో అతని పిడికిళ్ళు-బిగుసుకొన్నాయి. "తగిన బుద్ధి చెప్పాలి గాడిదకొడుకికి" అంటూ బాణంలా దూసుకుపోయాడు.

నేను కిటికీగుండా చూస్తూ ఉండిపోయాను పంతులు-అక్కడకి చేరుకొనే లోగా, ఆ వ్యక్తిమాటలు ముగించి నడక-సాగించాడు పంతులు అతని వెంట పడ్డాడు. వలుపు తిరిగేంత-వరకూ ఇద్దరూ ఒకరి వెనుకగా ఒకరు ఇరవై గజాల దూరంలో కనిపించారు

అలా ఎంతసేపు కూర్చొన్నానో నాకే తెలియదు. ఏదయినా - అఘాయిత్యం జరుగుతుందేమో నన్న భయం ఆవహించగా. నేను తిరిగి 'మిషన్' వంక చూసాను.

మిషన్' నుండి ఏదో పొగ వస్తున్నట్లు కనిపించింది. దగ్గరగా వెళ్ళి చూసాను 'పంప్ మోటార్' నుండి పొగ వస్తోంది. కాలుతున్న వాసన కూడా తగిలింది.

ఆ క్షణంలో ఏం చేయాలో పాలుపోలేదు నాకు. మిషన్-బ్రేక్‌డౌన్' కండిషన్‌లో ఉంది దాని అటెండరు డ్యూటీలో లేదు నేను ఒకచోట పనిచేయవలసినవాడిని మరో చోటికి వచ్చినందుకు సంజాయిషీ ఇచ్చుకోవలసి ఉంటుంది.

రెమి®



శాండల్ టాల్క్

నవ్యోత్సాహం చేకూర్చి
రోజంతా ఉల్లాసంగా వుంచగలదు









Sarath RST 3 TEL

ముందు మిషిన్‌ను ఆపుచేయడం' సవ్యమైన పనిగా తోచింది. అదిగాని పొరయినట్లయితే పంతులుని విలబెట్టి— వేలం వేసినా, నష్ట పరిహారం అవదు.

ఏది, ఎలా చేయాలో తెలియని నేను, ఒక్కసారిగా-'ఎలక్ట్రికల్-మైన్స్' అన్నీ 'ఆఫ్ చేసేసాను. బయట సిలిండర్, ఒక్కసారిగా పెద్ద శబ్దంతో క్రిందికి దిగింది. పీటిమీద-విపరీతమైన ఒత్తిడి కలగడంతో, దానిని బయటకు తీసుకు వెళ్ళపైపు కాస్తా బ్రద్దలయి. ఆకాశమంత ఎత్తులో నీరు బయటకి చిమ్మటం మొదలెట్టింది మిషన్ మాత్రం సవ్యంగా ఆగిపోయింది.

జరిగింది ఫోన్‌లో చెప్పాల్సిన అగత్యం లేకుండానే, పాఘగుంట వ్యవధిలో. చుట్టపట్ల కార్మికులు, సూపర్ వయిజర్లు అంతా అక్కడ గుమికూడారు.

అందులో ఎవరో అడిగారు నన్ను "ఏం జరిగింది' అని గుమికూడిన జన సమూహంలో పంతులుకోసం చూస్తూ చెప్పాను.

"పంతులు లెట్రిన్‌కి వెళ్ళాడనీ. వెళ్ళేటప్పుడు 'మిషన్' చూస్తూ ఉండమని నాతో చెప్పాడనీ, ఆ లోగ మిషన్ నుండి 'స్మోక్' రావడంతో ఏం చేయాలో తెలియక 'ఎలక్ట్రికల్ మైన్స్' అన్నీ ఒక్కసారిగా ఆపేసాననీ. అందుకే అలా జరిగిందనీ" చెప్పాను.

అతను విషయం అంతా డైరీలో వ్రాసుకొని. మిషన్ దగ్గరికి వెళ్ళాడు. మోటార్ చెక్ చేస్తూండగా పంతులు - వచ్చాడు.

"లెట్రిన్ కెళ్ళానని చెప్పు" మెల్లిగా చెవిలో చెప్పాను.

పంతులు సమాధానంగా తల ఊపుతూ అన్నాడు. "అతగాడు సూర్యమే: సందేహం లేదు. వర్క్‌షాప్ బయట జనంలో కలిసిపోయి. మరి కనిపించలేదు" అని.

'సూర్యాన్ని ఎలాగైనా చావనీ: ముందు ఈ సంగతి చూడు" కోపంగానే అన్నాను.

"అలాగే" అని. ఆ సూపర్‌వైజర్ దగ్గరగా వెళ్ళి. తను లెట్రిన్‌కెళ్ళిన సంగతి. ఆ కాస్సేపు చూడడానికి నన్నునిలబెట్టిన వైనం మరోసారి వికరవు పెట్టాడు పంతులు.

ఇచ్చిన రిపోర్టు సంతృప్తికరంగా ఉన్నా జరిగిన నష్టానికి-జవాబు ఇవ్వాల్సిన అవసరం ఉంటుందనీ 'ఫోర్‌మెన్'ని ఒకమారు కలిసి మాట్లాడమనీ. సలహా ఇచ్చి వెళ్ళాడు అతను.

ఆ రోజు సాయంత్రమే 'ఫోర్‌మెన్' గారింటికి బయలుదేరాం ఇద్దరమూ

ఫోర్‌మెన్ చౌదరి గారింట్లో అనుకోని విధంగా సూర్యాన్ని -కలుసుకోవలసి వచ్చింది. సూర్యం చౌదరిగారి మేనల్లుడేనట. పంతులిని చూడగానే సూర్యం బయటకి వెళ్ళిపోయాడు. ఆ విషయం తెలిసేసరికి. పంతులు విభ్రాంతుడై పోయాడు. నా బలవంతంమీద కాసేపు కూర్చోగలిగాడేగాని. అతని మనసులో - ఏం

జరుగుతోందో. ఎంత అస్థిరంగా ఉన్నాడో ముఖం చూడగానే తెలిసిపోతోంది.

చౌదరిగారు దాన్ని మరో విధంగా అర్థంచేసుకొన్నారు పంతులు భుజ మీద ఓదార్పుగా తట్టి. "మరేం భయంలేదోయ్! రాయవలసిన రిపోర్టంతా ముందుగానే రాసేసాను. ఇన్ని వందల మైళ్ళదూరంలో ఉంటూ. తెలుగు వాళ్ళం ఒకరి కొకరు సాయం చేసుకోకపోతే ఎలా" అన్నారు.

తృప్తిగా నిట్టూర్చి పంతులు ముఖంలోకి చూసాను. అతని ముఖం ఇంకా అలాగే ఉంది చెయ్యి పట్టుకొని మెల్లిగా లేవదీసి. బయటకు తీసుకు వచ్చాను.

ఆ మర్నాడు డ్యూటీకి పంతులు రాలేదు. రెండవనాడు. మూడవనాడు కూడా రాలేదు ఎక్కడ ఉన్నాడో. ఏమయ్యాడో అన్న ఆదుర్దా మొదలయింది నాలో.

ఆ పరిస్థితిలోనే సూర్యం ఎదురయి అన్నాడు నాతో. "పంతులు చాల దయనీయమైన స్థితిలో ఉన్నాడండి. చూడబోతే ఉద్యోగం మానేసేలా ఉన్నాడు"

"అదేం! ఎందుకు!" ఆశ్చర్యంతో అడిగాను.

"మీకు మా కథ కొంతవరకు తెలిసే ఉంటుంది సార్! చౌదరిగారు కేవలం మా మామయ్య అవడంవల్లనే అతని సహాయం పంతులు అంగీకరించే స్థితిలో లేదు.'

నా ఆశ్చర్యం రెట్టింపు అయింది. "అవును గాని సూర్యం! పంతులు విషయంలో నీకింత ఆర్ద్రా ఎందుకు!"

సూర్యం నా ముఖంవంక సూటిగా చూసాడు. తరువాత తలదించుకొని మెల్లగా అన్నాడు. "నేను తప్పు చేసానని ఒప్పుకొంటాను సార్! కాని ఒక విషయం ఆలోచించండి తప్పు కేవలం నా ఒక్కడివల్లనే జరిగిందంటారా!"

సూర్యం అన్నమాటలలో ఎంతో నిజం కనిపించింది. నిజమే మరి! వాళ్ళ

అన్నిచోట్లకు ఏజంట్లుకావలెను
RUBBER STAMPS రబ్బరు స్టాంప్స్
PRINTING BLOCKS ప్రింటింగ్ బ్లాక్స్
HOARDINGS, CINESLIDES, హోర్డింగ్స్, సినిమాస్లైడ్స్
FLOWRSENT TINBOARS, ఫ్లోరసెంట్ టిన్‌బోర్డ్స్
ఎస్.వి.యస్.
S.V.S ANAND ARTS
ఆనంద్ ఆర్ట్సు

అక్కయ్యతో స్నేహంకోసం సూర్యం పంతులిని వెడుఅలవాట్ల పాలుచేసాడు. వాళ్ళ అక్కయ్యకూడా తన సుఖవు కోసం తమ్ముడి అలవాట్లని ప్రోత్సహించింది గదా! తప్పు సూర్యానిది మాత్రమే ఎలా అవుతుంది.

"ఇంతకీ ఏం చెయ్యాలంటావ్!" నెమ్మదిగా తేరుకొని అడిగాను.

సూర్యం నా ముఖంవంక సంతోషంతో చూసాడు. "పంతులికి మరొక చోట ఎక్కడైనా పని చూపించాలి. ఈ పనిమాత్రం అతను వచ్చినా చెయ్యడానికి అంగీకరించడు." అని కాసేపాగి సాలోచనగా అన్నాడు. "చెంగైల్‌జూట్ మిల్లులో మా మామయ్య స్నేహితు లొకరున్నారు. అతను తలచుకొంటే పంతులికి అక్కడ పని ఇప్పించగలడు."

"మళ్ళీ మీ మామయ్యగారే పని ఇప్పించినట్లు అవుతుందిగా!"

"అందుకనే మీదగ్గకి వచ్చాను సార్! మామయ్య 'రికమెండేషన్ లెటర్' మీచేతికి ఇస్తారు. మీరు పంతులిని మీ బంధువుగా అతనికి పరిచయంచేసి పని కుదర్చాలి."

సూర్యం మంచితనం నాకు ఇప్పుడు అర్థమయింది. అతను చేసినతప్పుకి విచారిస్తున్నాడు. దానికి తనకు తానే శిక్ష విధించుకొని. పరోక్షంగా పంతులుకి సాయపడడానికి సిద్ధమయ్యాడు.

"అలాగే!" అంటూ సూర్యం భుజం తట్టాను. "కాని నీ విషయం......"

"నావిషయం ఏదీ పంతులుతో చెప్పవద్దు. అతని మనస్సులో నామీద 'పగ' అలాగే ఉండనివ్వండి. అతనుకూడా నన్ను క్షమించినట్లయితే నేనేమీ చేసినట్లే నాకు అనిపించదు."

నాచేతులు రెండూ పట్టుకొని సూర్యం అన్నమాటలు నన్ను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తాయి.

• • •

జూట్ మిల్లుకో పనికుదిరిన తర్వాత దగ్గర్లోనే ఇల్లు అద్దెకు ఏర్పాటు చేసి వస్తూ. "సూర్యంమీదపగ పెంచుకోవద్దు పంతులూ! పగ చాలా చెడ్డగుణం! మనిషిని దానవుడిగా చేసేశక్తి దానికేఉంది. అయినా సరిగా ఆలోచించి చూస్తే సూర్యానిదే తప్పు ఎలా అవుతుందో నీకే తెలుస్తుంది" అన్నాను.

పంతులు నావంకచూసి ఊరుకొన్నాడు నేనుకూడా విషయాన్ని రెట్టించకుండా వచ్చేసాను.

తరువాత మూడు నాలుగు నెలలకి నాపేర పంతులు వ్రాసిన ఉత్తరం వచ్చింది. ఉత్తరం చిన్నదే అయినా అది నాకిచ్చిన ఆనందానికి అంతులేకపోయింది.

ఆ ఉత్తరంలో ఉన్నదిది.

'గోపాలరావని మా ఫ్రెండ్‌కి పెళ్ళి జరుగుతోంది-సార్! వచ్చే శుక్రవారం నాడే అతని మేరేజి. ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే. మీరానాడు అన్న మాటలు ఒక విధంగా నిజమేనని. నాకీనాడు తెలిసివచ్చింది. గోపాలరావు సూర్యంలాంటివాడు కాదు. గంగిగోవు లాంటి మనిషి. అలాంటి వ్యక్తిని లొంగ




దీపకుని తనవెంట త్రిప్పుకో-గలిగింది ఆ పెళ్లి ఈ తురు సంగతి తెలిసి, వాళ్ళ వాళ్ళు తన్నడానికని, ఇతని రూమ్‌కి వచ్చి చాలా గొడవ చేశారు. చివరకి అతగాడు పెళ్ళికి ఒప్పుకోడంతో సమస్య పరిష్కారం అయిపోయిందనుకోండి దానివల్ల నాకు తెలిసింది ఏమిటి-అంటే స్త్రీ అంగీ-కారం లేనిదే-పురుషుడు ఎలాంటి ఒత్తిడి ఆమెపైన తీసుకు రాలేడని. ఈ వాదేగాని సూర్యం దగ్గర-ఉన్నట్లయితే పాతదంతా మరచిపోయి ఎప్పటిలా అతనితో-స్నేహంగా ఉండడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

ఉత్తరం తీసుకొని చౌదరిగారింటికి వెళ్ళాను. సూర్యం లేదు. కలకత్తా వెళ్ళాడట చివరికి నేనొక్కడినే-'బెంగైల్' బయలుదేరాను. సమయం వచ్చింది కాబట్టి వివరంగా అన్ని విషయాలు చెప్పేద్దామని. ఖరగ్‌పూర్‌కి, కలకత్తాకి మధ్య దారిలోనే ఉన్నదది

నేను 'బెంగైల్' చేరుకొనే సరికి, పంతులు, సూర్యం ఇద్దరూ ఒక్కసారిగా కనిపించారు. "కలకత్తానుండి తిరిగి వస్తూంటే ప్లాట్‌ఫారంమీద పంతులు కనిపించాడనీ బలవంతం మీద ఇక్కడ దించేసాడనీ" చెప్పాడు సూర్యం.

ఆరోజు-సూర్యం, పంతులు, గోపాలరావులతో పాటు, వాడుగో సిగరెట్టుని ముట్టించిన వాణ్ని నేనే అయ్యాను.

మనిషిలో మరుగున పడిపోయిన ఏ గుణమైనా-మంచే అవనివ్వండి. చెడేకానివ్వండి, చిన్నచిన్న విషయాలు ఆసరాగా తీసుకొని, అప్పుడప్పుడు తొంగి చూస్తాయనడంలో ఆశ్చర్యం లేదనిపించింది నాకు, ఆ క్షణంలో.

* • •

ఇరవయ్యేళ్ళ క్రితం మగపిల్లవాడు పుట్టగానే "వీణ్ణి అమెరికా పంపించి పై చదువులు చదివించాలి" అని అనుకున్నారు ముకుందరావుగారు. పిల్లవాణ్ణి చద్దన్నం చదువులు చదివించ గూడదనీ, అలగా వెధవల్తో తిరగనీయకూడదని గూడా అనుకున్నారు రావుగారు

ముకుందరావుగారనుకొన్నదానికి తిరుగేటూ వుండదు. ఆయనకు అంతంత బంగళావుంది. స్టీమరంత కారుంది. బ్రహ్మాండమైన బిజినెస్సుంది. కలితో సైగచేస్తే, చేతుల్తో చేసిపెట్టడానికి, ఆయన నౌకర్లకు కావల్సినంత పేదరికం కూడావుంది (అయ్యో! ఇదిగూడా రావు గార్కి Asset పనా!). ఆయనకున్నవన్నీ ఇలా చెప్పుకుపోతే ఓ పెద్ద లిస్టు తయారవుతుంది. వెనకవించీ చెప్పుకొస్తే, ఆయనకి జీవితంలో లేనివి బహుకొద్ది, అవైనా ప్రత్యక్షంగా కాక, పరోక్షంగా మాత్రం తెలుస్తుంటాయి.

"ఏంపిటో వెధవన్యాపారం. కంటి నిండా కునుకూ కడుపునిండా కూడూ లేకుండా పోతున్నాయి" అని విసుక్కుంటారాయన ఇతర్లముందు. (ఇంగ్లీష్‌లో)

"ఆఁ! ఎంతుండీ ఏంవిటి లాభం, రహీం? మీ షేర్‌కి బొత్తిగా.. లేకుండా పోతోంది" అంటుంది ఆయన భార్యకారు డ్రైవరుతో (హిందీలో, వంటరి సమయాల్లో)

"మా దొరకి కోపవొస్తే అద్దుండదు" అంటాడు పంటమనిషి ముత్యాలయ్య (అచ్చు తెలుగులో)

"జాలి అన్నది లేనే లేదు పాపిష్టి వాడికి. మొన్నటేడు ఫాక్టరీలో పన్జేస్తూ చెయ్యి తెగ్గోసుకొన్నవాడికింత వరకూ కాంపెన్‌సేషన్ (Compensation) ఇయ్యనేలేదు" అంటారు ఫాక్టరీ వర్కర్లు (మన్నించాలి బూతులు ఏ ఒక్క భాషకూ పరిమితమైనవికావు)

ఎవరేమనుకున్నా, ముకుందరావుగార్కి సుఖం, శాంతిలేవు అన్నమాట నిజం. కాని వాటికోసం ఆయనెప్పుడూ ప్రయత్నించలేదు. జీవితంలో అవ్వా, బువ్వా, రెండూ కావాలంటే దొరకటం కష్టతరమని తెలుసుకొన్నవాడాయన.

జాలిని తండ్రి అస్థికలతో బాటు గంగలో విడిచివచ్చిన జ్ఞాని డబ్బుతోనే ఆయన చెలిమీ, చెలగాటంకూడా.

సిల్కు జబ్బాలోని రూపాయికాసు విలువడాలరు చేస్తుందనీ, అదే రూపాయి కాసు చిరిగిన పైజమాలోకెళ్తే చిల్లిగవ్వ గూడా చెయ్యలేదనేది ఆయన థియరీ. లౌక్యం తెలిసిన వ్యక్తి అంటారు ఆయన్తో బాగా కలిసిపోయినవాళ్ళు. దాన్నే తిరగేసి "డబ్బుమీద చచ్చినంత యావ" అంటారు గిట్టనివాళ్ళు.

బిడ్డకు ముద్దుగా అనిల్ అని పేరు పెట్టారు. మూడేళ్ళ అనిల్ "అమ్మ", అంటూంటే ముకుందరావుగార్కి, వంటి మీద జెర్రులు పాకుతోన్నట్లనిపించింది. పుట్టిన ప్రతిబిడ్డా, మొదటిమాటగా "అమ్మ" అని అంటుంది. మూగయితే తప్ప. కానీ, ఎగ్జంప్లరీ గా (Examplary)

తయారవాలనుకొన్న తనబిడ్డ ఇంత ఇగ్నోరబుల్ మెజారిటీలో ఒకడుగా పోయినందుకు ఆయన మనస్సు బాధపడింది.

నో ఎటెనీకాస్ట్. దిస్‌షుడ్‌నాట్. హీ షుడ్‌బీ వన్ అమాంగ్ ది ప్రామినెంట్ మైనారిటీ (No. at any cost this Shouldnot happen He should be One among the Prominent minority) అని నిక్కచ్చిగా నిశ్చయం చేసుకున్నారు.

కోయిలను కొన్న పసిడిరెక్కల పిట్ట ఎలా తయారవుతోందని పసికట్టి, దానికి తగుమైన కట్టుదిట్టాలు చేశారు. ముకుందరావుగారు.

అనిల్‌ని దగ్గరకు తీసుకొని చిలకపలుకులు నేర్పారు. భార్యను "మమ్మీ" అనిపిలిపించి మురిసిపోయారు. తనను "డాడీ". అనిపించుకొని గోదావరిలా పొంగిపోయారాయన.

కిండర్ గార్డెన్లో చేరిన అనిల్ వడగాడ్పులు వీస్తున్న మిట్టమధ్యాహ్నపు వేళల్లో "డాడీ సీ. హౌనైస్ ది బ్రీజ్ ఈజ్" (Daddy, see how nice the breeze is) అన్నప్పుడు. అరవై లక్షల్తో చేసిన వ్యాపారం టేకాఫ్ (Take off) పొజిషన్లో కొచ్చేసినట్లు ఆనందపడి పోయారు ముకుందరావుగారు.

పదకొండేళ్ళ అనిల్ కాన్వెంట్లో చేరి లిటిల్ జంటిల్మెన్ అయిపోయాడు-ఆ వయసులోనే. అగాధాక్రిస్టీనలా అవుపోసన పట్టేశాడు.

—ఈవ్‌టీసింగ్ నేర్పని తనంతగా నేర్చుకొన్నాడు.

—ఇంగ్లీషు భాషలో. ఇంగ్లీషువాడు మాట్లాడినట్టే మాట్లాడాడు.

—ఇండియాను గురించి అతనికేమీ తెలీకపోయినా. అమెరికా గురించి చక్కగా తెలుసు.

భగవంతుడు తన ఇష్టంలేని వాళ్ళనందర్నీ ఇండియాలో పుట్టించేడనీ. తన బంధువర్గంలోని వాళ్ళనందర్నీ అమెరికాకు కేటాయించాడనీ. అతని థియరీ.

ముకుందరావుగారు ఎవరితో నయినా. తెలుగులో మాట్లాడుతూంటే. కుర్రాడికేమీ అర్థంగాక "డాడీ, వాటీస్‌దిస్ కిచిడీ లాంగ్వేజ్ (Daddy, what is this Kichady langnage) అన్నప్పుడు. ఆయన మనసు గాయపడలేదు.

పై పెచ్చు. ఇన్నాళ్ళూ పాలుతాగి ఎదిగిన పెంపుడు పులిపిల్ల మొదటిసారిగా ఆవు దూడను (పరాయి వాళ్ళది) పట్టుకోడం నేర్చుకొన్నట్లు ఫీలయిపోయారు. ముకుందరావుగారు.

రావుగారు నిర్మించిన ఆశాసౌధాన్ని కూలద్రొయ్యడానికి అనిల్ ఎప్పుడూ ప్రయత్నించలేదు. గాజుమేడలోని తన ఏర్కండిషన్డ్ గదిలో కూర్చొని ఒక్కపెట్టున పాఠాలు చదివాడు. చదివి చదివీ. అలిసిపోయినప్పుడు మాత్రం గది కిటికీలో నించి క్రింద రోడ్డుమీద చెమటోడుస్తూ బండ్లు లాగుతోన్న మనుష్యుల్ని చాలా క్యూరియస్‌గా చూచే

వాడు మైక్రోస్కోపులో పురుగుల్ని పరీక్షించే శాస్త్రజ్ఞుడిలా

ఇంటర్లో ఫస్ట్‌క్లాస్ రాకుంటే యూ షుడ్ బి ఎ బెగ్గర్ ఆన్ ది స్ట్రీట్ (You wold be a beggr on the street) అన్నారు ముకుందరావుగారు కొడుకుతో రంచన్‌గా ఫస్ట్‌క్లాసులో వచ్చాడు అనిల్

అనుకోకుండా బియస్సీలో పేపర్లన్నీ ఎదురు తిరిగాయి సెకండ్ క్లాస్ రావడం కూడా అనుమానమే డాడీ అవి చెప్పవలసి వచ్చినపుడు నువ్వు కన్న బిడ్డను పురిట్లోనే సంధి కొట్టిం- అవి కన్నతల్లికే చెప్పాల్సొచ్చిన మంత్రసానిలా బాధపడి పోయాడు అనిల్

డొంక అడ్డంగా వున్నప్పుడు నదుపాయంగా వెనకకించి నరుక్కు రావటం ముకుందరావుగార్కి మంచినీళ్ళప్రాయం

బ్లాంక్ చెక్కొకటి (Blank Cheaue) ఎగ్జామినర్ జేబులోకెళ్ళి కూర్చుంది

అనిల్ నంబర్ ఫస్ట్‌క్లాసు లిస్టులోకి తోసుకొచ్చింది

కుర్రాణ్ణి ఇండియాలోనే చదివించడానికి లేక అమెరికా పంపించి ఎమ్మెస్ (M s) చేయించడానికి అన్న మీమాంసలో పడిపోయారు ముకుందరావు గారు కొన్ని రోజులు కన్నబిడ్డ ఒక్కణ్ణీ అంతదూరం పంపడ మెందుకని అడ్డు బెట్టింది తల్లి

స్వర్గారోహణచేస్తూ ఆఖరు మెట్టెక్కుతోన్న ధర్మరాజుని విలేసి నేనెందుకిలా ముందుగా చనిపోతున్నానో చెప్పి


# దీర్ఘరోగులకు ఉత్తమ వైద్యము



హస్త ప్రయోగం అంగము చిన్నదగుట సంభోగ కాలమంతు అకస్మాత్తుగా స్ఖలించి అసంతృప్తి చెందుట శుక్లనష్టము నపుంసకత్వము (ఒక డోస్‌తో ఎన్నడు కనివిని ఎరుగనంత వీర్యస్థంభన కల్గి హాయినిచ్చును స్త్రీనికోరు ప్రతి పురుషుడు వాడతగినది స్వస్తులు) ఉబ్బసము (దమ్ము) బోదకాళ్ళు కుష్ఠు బొల్లి చర్మవ్యాధులు కడుపునెప్పి చెవుడు పోస్టుద్వారా గ్యారంటీ చికిత్స చేయబడును

శ్రీ బాలాజీ వైద్యశాల డా పి కుమారస్వామి దేవర

ట్రావెలర్సు బంగళారోడ్ తెనాలి (ఎ పి)




వెళ్ళమని భీమసేనుడు అడ్డు తగిలినప్పుడు యమనందనుడు విసుక్కున్నాడో లేదో కానీ. అనిల్ మటుకు ఆరోజు తల్లి దండ్రులమీద అంతకు రెట్టింపు విసుక్కున్నాడు. కాస్త చిరాకు పడ్డాడుగూడా.

చివరకు అనిల్ని అమెరికా పంపడానికి నిశ్చయించేశారు రావుగారు.

బిజినెస్ లాబీస్‌లో (Business lobbies) తనకున్న పలుకుబడి వుపయోగించి. సీటు, పాస్‌పోర్ట్ వగైరాలన్నీ సంపాయించారు.

పద్నాలుగేళ్ళ అరణ్యవాసం తర్వాత అయోధ్యకెళ్తున్న రామలక్ష్మణుల మనసులా చాలా వుల్లాసంగా వుంది అనిల్‌కి అమెరికా వెళ్ళడం. పెళ్ళి అయిన తర్వాత మొదటి సారిగా పుట్టింటికెళుతున్న పడుచుపిల్ల మనసులా వుంది అతని హృదయం.

అసలు వారంరోజులుగా అనిల్ ఇంటి పట్టున లేనే లేడు. ఏ పూట కూడా ఇంట్లో భోజనం చెయ్యలేదు.

అరోమా (Aromo) మాటల్లో అందం "త్రీ చీర్స్." డిమ్ లైట్ల జలతారలో సోహినీ మెహతా వెచ్చని స్పర్శ. మిస్. దేవింటీ తన గుండెను వెచ్చగా తాకే వూపిరి—ఇదంతా అతనికి ఏర్‌పోర్ట్‌లో ఎన్‌ప్లేన్ చేసే వరకే గుర్తు వున్నాయి.

ప్లేన్ జోరుగా పైకెగిరింది. అంతకంటే వేగంగా అనిల్ హృదయం దూసుకపోతోంది అమెరికా వైపు.

అమెరికాలో రాయంచలా దిగిన ప్లేన్ నుండీ అందరూ త్వర త్వరగా దిగి వెళ్ళిపోతున్నారు. దూరంగా ఒకతని చేతిలో కన్పించింది ప్లెకార్డ్. "వెల్కం టు మిస్టర్ అనిల్" అని.

అయామ్ మిస్టర్ అనిల్ ఫ్రమ్ ఇండియా (I am Mr. Anil from

India) అచ్చు అమెరికన్లానే అన్నాడు అనిల్

''ఆయామ్ స్టువర్ట్. వెల్కం టు యూ షల్ వుయ్ మెక్ ఎ మువ్'' I am stuwart shall we make a move!)

స్వర్గంలో అడుగు పెట్టినవాడు తన్మయం చూచినట్లు చుట్టూ వున్న వాతావరణాన్ని చూస్తూ వుండిపోయాడు. అనిల్.

కారు దూసుకు పోతోంది రోడ్డు మీద. ఇటూ, అటూ రోడ్డు కిరువైపులా స్కై-స్క్రేపర్స్)

పునర్జన్మ సిద్ధాంతమే గనుక నిజమైతే మయుడొక్కడే ఇక్కడ జన్మ ఎత్తి ఇలాంటి భవనాలు కట్టి వుండాలి అని అనుకున్నాడు అనిల్ క్షమించాలి. ప్రెజెంటేషన్‌లో ఎక్కడా మయుడి ప్రసక్తి రాదు. అందుకని ఆ పేరే అనిల్ విన లేదు. కారు ఓ పెద్ద బంగళా ముందు ఆగింది. అనిల్‌కి తన ఫ్లాట్ చూపించి. ఏది ఎక్కడ దొరుకుతుందో బోధపరిచి-

'ఓ. కె. బై యువర్ లీవ్. నేను సాయంత్రం వచ్చి మిమ్మల్ని పికప్ చేసుకుంటాను డిపార్ట్‌మెంటులో మీకీ రోజు వెల్కం పార్టీ వుంది. సాయంత్రం ఆరింటికి తయారుగా వుండండి'' అంటూ వెళ్ళిపోయాడు స్టువర్ట్.

• • •

తను పని చెయ్యబోయే లాబరేటరీని చూసిన అనిల్. ఇంత ఆస్తి వుండి కూడా అమెరికాలో సెటిల్ కానందుకు తన తలిదండ్రుల్ని ఇండియాలో తనను పుట్టించిన భగవంతుడ్నీ. కలిసి ఒకేసారి మనసారా తిట్టుకున్నాడు

గెట్టుగెదర్ (Get gether) చాలా సింపుల్‌గా అయిపోయింది వెల్‌కమ్ స్పీచ్ చదివాడు స్టువర్ట్.

అనిల్ని ఏదయినా మాటలాడమన్నారు. ''దేన్ని గురించి మాట్లాడను'' అని అడిగేడు స్టువర్ట్‌ని.

'ఇండియన్ కల్చర్. ఇండియన్ క్లాసికల్ మ్యూజిక్. ఇండియన్ వే ఆఫ్ లివింగ్. హిందూ ఫిలాసఫీ. ఎనీ టాపిక్ యూ లైక్'' అని జవాబు (Indian cultur' Indian classical Meusic, Indian way of living, Hindu philosophy, any one you like)

దయాప్ మీదెక్కడంతోటే అనిల్‌కి ఒక్కసారి చెమటలు పోశాయి. ఏ టాపిక్ మీద మాట్లాడనూ అని ఆలోచించుకొన్నాడు ఏదీ బుర్రకు తట్టడం లేదు.

''ది అమెరికన్ వే ఆఫ్ లివింగ్'' మీద తను వేలాది డిబేట్లో మాట్లాడితే ఫస్ట్ ప్రయిజొచ్చింది.

గార్డెన్లో కూర్చుని జాజ్ సంగీతం మీద తనేదో చెబితే

''అనిల్! నీ కివంతా ఎలా తెలిసొచ్చేయి. ఎక్కడ చదివేవు'' అని తెగ మురిసి పోయింది తన కొలీగ్ మిస్. ఉమా మాధుర్ (ముచ్చట పడ్డవే గాకుండా మురిపెంకూడాతీర్చింది.పాపం!)

''ఇండియన్ కల్చరట. మనకూడా ఓ కల్చరా? వరి ఫకీర్‌జాలి'' అంటూ ఎన్నోసార్లు విట్‌వేసి. నవ్వించేవాడు.

మరి, సరిగమలతో ఈ స్త్రీవట్లు అంటూ (Acrobiotics) తాను ఛేదించుకొన్న సంగీతం మాటేమిటి?

తనకు తెలిసిన ఇతర విషయాల విలువ ఏమిటి ఈ దేశంలో? తనకు తెలిసి. ఇష్టంలేక శ్రీపి రాజన్న తన స్వదేశపు విషయాలకు ఇంత విలువఏమిటి ఇక్కడ? స్వర్గంలో వుంటూ నరకాన్ని గూర్చి తెల్సుకోవాలన్న తృష్ణ వీళ్ళ కెందుకు? అద్దాల మేడలో కూర్చొని అన్ని సౌఖ్యాలూ అనుభవిస్తున్న ఈ అదృష్టవంతులకు ఇండియాలోని కీటకాల బతుకు తెలాకగలదితే ఏమిటి? తన దేశం (దౌర్భాగ్యపు)లోని సంగీతం, సంస్కృతి సాహిత్యం. ఇంత ఉత్కృష్టమైన వా? అన్న ప్రశ్నలన్నీ మెదడులో ఒక్కసారి మొలకెత్తి, ముసురు పట్టి, ఉక్కిరిబిక్కిరయిపోయాడు

ఎదురుగా తననే చూస్తున్న కాలీగ్స్‌ని చూడగానే చప్పున కర్తవ్యం గుర్తుకొచ్చింది.

"ఫ్రెండ్స్, మీరడిగిన ఏ విషయం గురించి మాటాడాలన్నా చాలా లిటరేచరు రిఫరు చేయాలి. ప్రస్తుతం అతికష్టతరమైన పని. పైగా ప్రయాణపు బడలిక నించీ నేనింకా కోలుకో లేదు. క్షమించాలి."

అని పొడిగా చెప్పి కూర్చుండిపోయాడు.

బఫెట్ పార్టీలో నిల్చొనున్న అతనికి వినిపించింది సన్నగా "దిస్ బెగర్ ఈజ్ నాట్ నో ఎనీథింగ్ అబౌట్ హిజ్ ఓన్ కంట్రీ (This begger does no: know Onything about his own country) అని స్టూవర్ట్ ఎవరితోనో అనటం.

పార్టీ అయిపోగానే, తన ఫ్లాట్‌కి స్టూవర్ట్ కారులో తిరిగి వస్తున్న అనిల్‌కి గుండెలో ఏదో గుచ్చుకొని కలుక్కుమంది

తను ఇన్నేళ్ళుగా కష్టపడి నేర్చుకొని వాటి విలువలు ఇక్కడ మంచినీళ్ళప్రాయమని తెలిసికొని, ఎంతో పదిలంగా నిర్మించుకొన్న గాజుమేడ ముక్కలు ముక్కలుగా పగిలినట్లు పీలయి తన బంగారు కలలిలా ఈ రోజు విరిగిపోయినందుకు. మొదటిసారిగా బతుకులో, అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. పాపం! *


మూలశంకకు
త్వరగా
నమ్మకమైన
హెడన్సాతో
చికిత్సను పొందండి
—శస్త్రచికిత్స
అవసరములేదు !



# "మా శ్రీమతి మహాత్మ్యం లేక నా నూరవకథ చరిత్ర

ఎమ్మీయ్యాం ర్రాంక్

ఏ(వండీ......

''ఏమండీ.''

''మతెం''

''మతేం''

''మన......''

''అబ్బబ్బ. ఏమిటా నణుగుడూ. మవ్వాను. చెప్పేదేదో సరిగ్గా చెప్ప రాదూ''

"అది కాదండీ. మన పక్కింటి వసంత లేదూ —

'ఎందుకు లేమా. విశేషంలా ఉంటేనూ''

''మీరంతే. ప్రతిదానికీనూ. చెప్పేది సరిగ్గా వినరు పైగా నన్నంటారు. వసం తేమో కథ రాసిందటండీ.''

''కొంపతీసి నన్ను చదవమనడం లేదు కదా?

"చాల్లెండి మీ వెళాకోళం. మీరూను ఆ కథ వీక్లీలో పడిందండీ''

''ఓస్ ఇంతేనా ఇదేదో ఘనకార్య మన్నట్టు చెప్పతున్నావ్. అసలు ఈ రోజుల్లో కథ వ్రాయని అడదెవరు చెప్పు.'' ఇంతకీ నన్నేం చేయమంటావు? డొంకతిరుగుడు లేకుండా తిన్నగా చెప్పు''

''మీరు కూడ ఒక కథ రాసి...నా పేరుతో ఏదేనా పత్రికకు పంపించండి.''

''మార్వెలెస్. నీ బుర్రవి లతరూపా యలకి ఇన్సూరెన్స్ చెయ్యాలోయ్. థర్డ్ ఫారం మూడోసారి పెయిలయిన నీ బుర్రే ఇంత అమోఘంగా ఉంటే బి. ఏ. చదువుతున్న మీ వసంత కథ రాయ డంలో ఆశ్చర్యమేముంది? అందుకే ఈ మధ్య ఆడాళ్ళ కథలెక్కువయిపోయాయి. పత్రికల్లో. దానికి మగాళ్ళంతా పెడర్థాలు తీస్తారు. అసలు ఆడాళ్ళ బుర్రలమోఘ మైనవని వెనకటికి షేక్స్పియరో ఎవరో అన్నారట''

''ఏమిటండీ మీ లెక్చరూ. మీరూనూ కథ రాయమంటూ చేను."

''ఎవరేనా వింటే నవ్వుతారుగాని నోరు మూసుకుని ఊరుకో. రేపు క్లాసుకి ప్రిపేరవాలి'' ''ఎం. బి ఏ చదివిన వసంత రాయగా లేంది ఎమ్. ఇ. చదివేరు. మీరు రాయలేరూ''

''ఇంకా నయం. థర్డు ఫారం ఫెయి యిన నేనే వంట చేస్తున్నాను మీరు చెయ్యలేరా అనలేదు'' ''నాకు తెలీదను కోకండి. మీ అక్కగారు అంతా చెప్పే సారు.''

''నా కథలు. భూమి గుండ్రగా ఉందని నిరూపించేవని చెప్పిందా? సరేలే ఈసారి కూడ ప్రయత్నిస్తాను కాగితాలు. కలం పట్రా."

ఈ విధంగా మొదలయింది నాలో కథా ప్రయత్నం. ఇంతవరకూ రాసిన తొంభై తొమ్మిది కథలను సంపాదకులు శ్రమను కోకుండా తిరిగి పంపితే వారు ఏమో ఈ సారెలా వుందో మనదృష్టం ట్రై యువర్ లక్'' అనిపించింది.

''చూసి రమ్మంటే కాల్చి వస్తుంది మా ఆవిడ. కాగితాలు పట్రామంటే. కాగితాలతోపాటు. ఫ్లాస్కుతో కాఫీ. సిగ

రెట్లు. అగ్గిపెట్టె! సరంజామా అంతా శేబిలు మీద సర్దింది.

"ఏమండీ కథకు పేరేమని పెడ్తారు? ఏ పత్రికకు పంపిస్తే బాగుంటుందం టారు?"

"సరే, ఆలూ, చూలూ లేదు, కొడుకు పేరు సోమలింగం" అన్నాడంట వెనకటి కెవడో. నన్ను అట్టే డిస్టర్బ్ చేయకు మూడ్ పోతుంది" అన్నాను.

"అలాగే లెండి. నేను పోయి వంట చేస్తాను. మీరు మాత్రం కథ వేగంగా పూర్తి చేయండి." అంటూ ఉత్సాహంగా వంటింటిలోకి నడిచింది

"థేంక్స్ టు వసంతా. థేంక్స్ టు కథ" అనుకున్నాను మనస్సులో తిన బోయే రుచికరమైన వంటకాలను తలచు కుంటూ.

ఎంత బుర్ర బ్రెర్రి చేసినా ఏమి రాయాలో పాలుపోవడం లేదు. తొంబై తొమ్మిది కథలు ఎలా రాశానా అనిపించింది. ఆఫ్ కోర్సు అన్నీ తిరిగొచ్చాయని మీకు తెలుసనుకోండి. అయినా మొత్తం మీద రాశాను గదా.

రెండు గంటలు కష్టపడి చెత్తబుట్ట మాత్రం నింపగలిగేను. ఇంతలో మా శ్రీమతి వంటింటిలోంచి వచ్చింది వంట యిందంటూ. చెత్తబుట్టకేసి చూపించాను. కళకళ్లాడుతున్న మొహం కాస్తా మాడి పోయింది: భోంచేసిన తర్వాత రాస్తాగా అని ఆశపెట్టి భోజనానికి లేవాను. అలా చెప్పకపోతే వస్తుందమనేదేమో!

భోంచేసిన తర్వాత కూడ ఏమీ కుదర లేదు. ఏదో రాశాను గాని అది కాస్తా అతుకుల బొంతగా తయారయింది. ఇంతలో మా శ్రీమతిగారికి బ్రహ్మాండ మయిన ఐడియా వచ్చింది

"ఏమండీ అలా పొలాల కేసి వెళ్ళ కూడదూ? అక్కడయితే మంచి ఆలోచ నలొస్తాయట ఒకసారి వసంత చెప్పింది. కథ రాసి తీరాలి మీరు. అని ధ్వనించింది ఆమె కంఠం.

అది నాకు గూడ సబబుగానే తోచింది. అలా పొలాల కేసి బయల్దేరాను కథ గురించి ఆలోచిస్తూ. నా కర్మగాలి చిన్న ప్పుడెప్పుడో మా మాష్టారు చెప్పింది కాస్తా గుర్తుకొచ్చింది అదే సమయంలో.

"పెద్దనామాత్యుడొకసారేమన్నాడో తెలుసునట్రా చక్కని స్త్రీ పక్కనలేంపే కవిత్వం రాదు అన్నాడు!" ఇది క్లాసు కొకసారైనా చెప్పేవాడు పెద్దనామా త్యుడు నిజంగా అన్నాడో లేదో గాని మా మాష్టారు మాత్రం రోజూ అనే వాడు.

అంతలోనే ఒక పల్లె పడుచు వయ్యా రంగా నడుస్తూ పోతోంది. తల మీద గడ్డిమోపు చేతిలో కొడవలి. ఆమె నడు స్తుంటే పొడుగైన ఆమె జడ పిరుదల మీద నాట్యం చేస్తున్నట్లుంది ఆహా! ఏమి సౌందర్యం! నాలో గూడ కవిత్వం వచ్చేస్తున్నట్లుంది.

కాస్సేపలాగే ఉంటే. వెధవది కధే మిటి వనల రాసి పారేసేవాడ్ని. కాని దైవలీల మరో విధంగా ఉంది.

"ఏమయ్యా వంతులూ బుద్ధుందా లేదా నీకు. ఆడదాని కేసి ఆలా నోరు వెళ్ళబెట్టావేమయ్యా."

ఉలిక్కిపడి తేరుకున్నాను. ఎదురుగా ఓ బక్క ప్రుదైవ యువకుడు కనిపించాడు. కల్చర్ లేకుండా మాట్లాడుతున్నా డేమిటా బ్రూట్ అనుకొన్నాను మనసులో. నేను కళా హృదయంతో చూస్తున్నట్టు ఈ పూల్ కేమి తెలుస్తుందిలే అని కొని సమాధాన పర్చబోయాను. అయినా వూరుకో లేదు వాడు.

ఈ సారి ఇట్టాంటి పనులు చేశావంటే మక్కె లిరుగుతయి జాగ్రత్త" అని వార్నింగిచ్చి పోయాడు.

మా శ్రీమతిని నమిలి మింగేద్దామా అన్నంత కోపం వచ్చింది. ఈ బ్రూట్ చేత మాటలు పడ్డాను. పైగా ఆ స్త్రీ వక్కికిలించింది కూడాను. అయినా వెధవద ముందు వాడు కనపడలేదు. అర్జునుడికి పక్షి ఒకటి కనిపించినట్లు నాకు ఆ స్త్రీ మోము తప్ప ఇంకేమీ కన్పించలేదు. ఇంకెప్పుడూ కథలు రాయకూడదని నిర్ణయించుకొని ఇంటికి బయల్దేరాను.

నా కోసమే కాచుకొన్నట్టుంది "ఏమండీ ఏమన్నా ఐడియా వచ్చిందా?" అంది ఎదురుగా వస్తూ.

నాకు చిర్రెత్తుకొచ్చింది. దీనివల్లేకదా అనవసరంగా మాటలు పడింది అని.

నే వింక కధారాయను పారూరాయను అని ఖచ్చితంగా చెప్పేశాను.

"ఏం? ఎందుకని" కొంచెం కరుకుగా ఉన్నాయి మాటలు.

"అవును. ఎందుకని ఏమని చెప్పను విజం చెప్తే ఇంకేమన్నా ఉందా!! కొంప లంటుకుంటాయి. "అబ్బే ఏం లేదు వూరికే అన్నాను. బ్రహ్మాండమైన ఐడియా వచ్చింది అన్నాను అర్థంగా కోపేస్తూ.

"నాకు తెలుసు మీకు వస్తుందని."

ఏమిటో ఆ కాన్ఫిడెన్స్.

రాత్రికి రెండు కాగితాలు వలుపు చేసి మా ఆవిడ కిచ్చేను. మిగిలిందంతా మా ఆవిడ పూర్తి చేసింది. ఆవిడే తన పేరు రాసుకొని కవరులో పెట్టి వీక్లికి పంపించింది ఆ కథని.

ఇంకెప్పుడూ రాయకూడదని మనసులో ప్రమాణం చేసుకొని అనూరన కథ గురించి మరిచిపోయాను.

కాని. మా ఆవిడ పేరు పెట్టిన ఫలమో ఏమో ఓ వారం రోజుల తర్వాత ఎడిటర్ దగ్గిర నుంచి ఉత్తరం వచ్చింది "మీకథ వచ్చేవారం ప్రచురిస్తాన్నామని" ఆ తర్వాత వారం నిజంగా ప్రచురించేరు కూడా.

నాకు నిజంగా మతిపోయింది. కధ పడిందని కాదు. ఇక మా ఆవిడ బ్రతకనివ్వదని.

ఈ సరికి మా రెండో ప్రక్కనున్న రామారావు కూడా కష్టాలొచ్చుంటాయి. పోయి కండొలెన్సెస్ చెప్పాలి.

కంగ్రాచ్యులేషన్స్ మిస్టర్ రవికుమార్! అనుకున్నట్లుగానే ఫస్టు క్లాసులో పాసయినందుకు చాలా సంతోషంగా వుంది." ప్రొఫెసరు భాస్కరరావుగారు అభినందించారు.

"థాంక్యూ సర్ ఇదంతా మీ చలవే నండి" వినయంగా సమాధానమిచ్చాడు ఎం. ఎస్ సి ఫస్టుక్లాసులో పాసైన రవికుమార్

"అదేమిటోయి ఇందులో నాదే ముంది. తెలివైనవాడివి. కష్టపడి చదివావు. ఫలితాన్ని పొందావు అన్నట్లు చెప్పడం మరచిపోయాను. మనయూనివర్సిటీ తరపున స్కాలర్‌షిప్‌పై నిన్ను అమెరికా పంపించాలని ప్రయత్నాలు జరుగుతున్నట్లు విన్నాను. బహుశా ఇవాళో రేపో ఏ సంగతీ తెలుస్తుంది. మరి నీవేమంటావు?"

"అవకాశం లభిస్తే తప్పక వెళతానండి. ఏదో ముఖ్యవిషయం మాట్లాడాలని కబురంపారు."

"అః! అన్నట్లు మరచే పోయాను సుమా! చాలా ముఖ్యమైన విషయమే సుమా! మా అమ్మాయి విజయపై నీ అభిప్రాయమేమిటి?" ఆయనడిగారు.

"ఆమెకేమండి? విద్య, వినయం, రూపం అన్నీ మూర్తీభవించిన యువతి" అంటూ ఎందుకడిగారో అర్థంకాక ఆయనవంక చూశాడు

"అందుకనే అన్ని విధాలా మీయిద్దరికీ యీడూ జోడూ వుంటుందని విజయను నీకిచ్చి వివాహం చేద్దామనుకుంటున్నాను. ఏమంటావు?"

"క్షమించండి మీలాంటి వుత్తముల మాట కాదంటున్నందుకు మన్నించండి. నా వివాహాన్ని గురించి ఇదివరకే అన్ని ప్రయత్నాలు జరిగాయి." నెమ్మదిగా అన్నాడు రవి.

"అంటే ఎవరినైనా ప్రేమించి పెళ్ళి చేసుకోబోతున్నావా?"

"లేదండి. ప్రేమించి పెళ్ళి చేసుకునేటంత స్వేచ్ఛ, స్వాతంత్ర్యం నాకులేవు. చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగుట్టుకొన్న నన్ను మా మామయ్యే పెంచి ఇప్పటివరకు చదువు చెప్పించారు. ఒకే ఒక్క షరతుపై. అదేమంటే వాళ్ళ అమ్మాయిని నేను వివాహం చేసుకోవాలి." రవి చెప్పకపోతున్నాడు

"ఆ అమ్మాయి అంటె నీకిష్టంలేదా?"

"ఇష్టం వుందని చెప్పలేను. అయిష్టంతో కాదని అనలేను. ఏదో విధమైన అయోమయావస్థలో చిక్కుకున్నాను. చిన్నప్పటినుండి ఇద్దరం ఒకే ఇంటిలో పెరిగిన వాళ్ళమవడం వల్ల ఆమె పై ఎలాంటి అనుభూతినీ పెంచుకోలేదు. వివాహం చేసుకుంటానన్న షరతుపైనే నాకు మామయ్య ఇప్పటి వరకు చదువు చెప్పించారు. ఆస్థిపాస్తులు లేనివాడికి ప్రతిఫలాపేక్షలేకుండా ఇంత ఖర్చుచేసే స్వభావం కాదాయనది."

"మరి నీపై ఆ అమ్మాయి అభిప్రాయంయేమిటి?"

"ఆమె అభిప్రాయమేమిటో తెలును

కోవాలన్న కుతూహలం ఇప్పటివరకూ వాకు కలగలేదు. అదృష్టం కావాలని దగ్గ రకు వచ్చినా, అనుభవించే జాతకం ఏ కొద్దిమందికో మాత్రమే వుంటుంది. కాని వాలాంటి నిర్భాగ్యులకు మాత్రం వుం డదు. అందువల్లే మీ మాట కాదంటు న్నందుకు క్షమించండి ప్రొఫెసర్!'

"డోంట్‌వర్రీ మిస్టర్ రవీ! నీ పరి స్థితి తెలియక అడిగాను అంతే మరోలా భావించకు. ఏమైనా అమెరికా వెళ్ళేముందు మీ మామయ్యగారి అమ్మాయిని వివాహం చేసకొని ఆమెనుగూడా తీసుకువెళితే మంచిదని నా వుద్దేశ్యం." నవ్వుతూ అన్నారాయన.

"ప్రయత్నిస్తానండి.. "తను ఆయన మాటను త్రోసి పుచ్చినా అమాయకంగా నవ్వుతున్న ఆయనవైపు వింతగా చూశాడు రవి.

* * *

రూముకు వెళ్ళి తాళం తీసి లోపల ఒక కవరు పడి వుండటం గమనించి విప్పి చదవడం మొదలెట్టాడు రవి

బావా!

ఏమిటి ఎప్పుడూ లేనిది నిర్మల ఇలా వుత్తరం వ్రాసిందని ఆశ్చర్య పడు తున్నావా? అవును మరి ఇదేగా నేను నీకు వ్రాస్తున్న మొదటి వుత్తరం. నీవు ఫస్ట్‌క్లాసులో పాసైనావని విని అమ్మ, నాన్న, నేను ఎంత సంతోషించామో తెలుసా? పదిరూపాయలు ఖర్చుపెట్టా లంటే పదిరోజులు ఆలోచిస్తూకూర్చొండే నాన్న ఇవాళ ఆయన మిత్రులను పందరనీ పిలచి ఓ పెద్ద డిన్నరు ఇచ్చారు. నీ పుణ్యమా అని అమ్మకు చేతినిండా పని తగిల్ింది.

బావా! నేను వుత్తరం వ్రాశావంటే ఏదో ప్రేమలేఖ వ్రాస్తానని ఆశతో చదువు తున్నావుకదూ! పాపం ఏం చేస్తాను మరి. వ్రాయక తప్పడంలేదు. నీ చదువు పూర్తయింది కదాని నాన్నేమో మన పెళ్ళికి ప్రయత్నాలు ప్రారంభించేస్తు న్నారు. ఎప్పుడు సెలవులలో నీవుఇంటికి వచ్చినా నాతో సరిగా మాట్లాడనే మాట్లా డవు. అదో మాదిరిగా వుంటావు. మరి నీవుద్దేశ్యం ఎలావున్నా నా వుద్దేశ్యం మాత్రం వ్రాస్తున్నాను.

బావా! ఎందుకో నిన్ను వివాహం చేసుకోవాలని నా కనిపించడం లేదు. మరి ఈమాటే నాన్నగారితో అందామా అంటే గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయి. నాకు ధైర్యం చాలడం లేదు. ఎవరిని చేసుకుంటావు? ఏమిటి? అని ప్రశ్నిస్తు న్నావా? అవన్నీ సశేషం అంటె ఈసారి వచ్చే వుత్తరంలో ముగింపు వుంటుంది. అప్పటివరకు సస్పెన్స్. వివరాలన్నీ అప్పుడు తెలియచేస్తాను ఇంకో రెండు మూడు రోజుల్లోనే వ్రాస్తానులే. మరి నీవిలాగా అనవసరంగా కంగారుపడి జుట్టు ముందేసుకుని దేవదాసువయ్యేవు చేకిట్ ఈజీ

మరివుంటాను.

నిర్మల.

ఉత్తరం పూర్తిచేసిన రవికి అంతా అగమ్యగోచరంలా తయారయింది. ఈ

సంవత్సరమే కాలేజీ చదువు ప్రారంభించిన నిర్మల ఎవరినైనా ప్రేమించి వుంటుంది. ఈ సమస్య ఎలా పరిష్కరించడం? అంతులేని ఆలోచనలో పడ్డాడు రవి. వెంటనే ప్రొఫెసరుగారు గుర్తువచ్చారు.

• • •

"కమాన్ రవి! ఇప్పుడే టెలిఫోన్ కాల్ వచ్చింది. నీకు కబురు చేద్దామనుకుంటుండగానే నీవేవచ్చావు. నీకు స్కాలర్‌షిప్ గ్రాంటు అయిందట. రేపే బయలుదేరి నీవు అమెరికా వెళ్ళాలి. మరి అంతా సిద్ధమేనా?" అప్పుడే లోపల కడుగిడిన రవినడిగారు భాస్కరరావుగారు.

"చాలా సంతోషమండి. కానిసార్: రేపే వెళ్ళి తీరాలంటారా?"

"అమెరికా వెళ్ళాలి అనుకుంటే మాత్రం రేపే వెళ్ళాలి అన్నీ సిద్ధమయిన తరువాత వాయిదా వేసుకోవాలంటే కుదరదనిపని. అయినా బయలుదేరడానికి ఏమిటి నీ అభ్యంతరం?"

"ఏమీ లేదనుకొండి. సరే అలాగే వెళతాను. ఉదయం మీరు అడిగిన విషయాన్ని మాట్లాడదామని వచ్చాను మీ అమ్మాయిని వివాహం చేసుకోవడానికి ఇప్పుడు నాకు ఎలాంటి అభ్యంతరం లేదండి" రవి అన్నాడు.

"నో, నో! నీకభ్యంతరం లేకపో

nital
నిషాక్
చెవి చుక్కలు

యినా నాకు వుంది. ఇంకొకళ్ళను మోస గించి మా అమ్మాయిని వివాహం చేసుకో మనేంత స్వార్థపరుడని కాను" గట్టిగా అన్నారాయన.

'ఇందులో స్వార్థమేమీ లేదండి. నే నెవరినీ మోసం చేయడం లేదు కూడా. ఈ వుత్తరం చదవండి. మీకంతా అర్థ మవుతుంది" అంటూ వుత్తరాన్నాయన కందించాడు రవి.

"అరే! కథ ఇలా మలుపు తిరిగిందా?" వుత్తరం చదవడం పూర్తిచేసి అన్నా రాయన.

"అవునండీ! అందుకే నేనూ ఆశ్చర్య పడుతున్నాను. ఒకసారి మావూరు వెళ్ళి వస్తేబాగుంటుందేమోననుకున్నాను. కాని అవకాశంలేదు." బాధగా అన్నాడు.

"మీవూరుదగ్గరకూడా కాదు. వెళ్ళి రావాలంటే రెండు రోజులు పడుతుంది. మరి మీ వివాహం వెళ్ళివచ్చిన తరువాత జరుపమంటావా లేక ఇప్పుడే చేసుకొని అమ్మాయిని కూడా తీసుకెళతావా?' ఏ మం టావన్నట్టు తలవూపుతూ అడిగారాయన.

"మీ ఇష్టప్రకారం చేయండి అయినా వెళ్ళివచ్చిన తరువాత పరిస్థితులెలా వుం టాయో చెప్పలేను వీలైతే వివాహం చేసుకునే వెళతాము."

"సరే-అలాగే చేద్దాం ఈవేళే రిజి స్టారు ఆఫీసులో మీ వివాహం చేస్తాను". అంటూ హడావిడిగా భాస్కరరావుగారు లోపలకు వెళ్ళారు

ఆరోజే రవి. విజయల రిజిస్టరు మారేజి జరిగింది. వెంటనే రవివాళ్ళ మామయ్యకు ఓ వుత్తరం వ్రాశాడు.

పూజ్యులైన మామయ్యకు!

నమస్కారములు. మీకు తెలియ పరచకుండా ఈరోజు ఇక్కడ నా వివా హం తలవని తలంపుగా జరిగిపోయింది. నేను రేపే బయలుదేరి అమెరికావెళ్ళాలి. చిన్నప్పటినుండి నిర్మలను నా కిచ్చి వివాహం చేదామనుకున్నారు. నిర్మలపై నేను ప్రేమను పెంచుకోలేకపోయినా వివాహం చేసుకుందామనే అనుకున్నాను. కాని ఈరోజే నిర్మల మరొకరిని ప్రేమిం చానని తెలియజేసింది. పాపం-ఆమాయ కురాలు ఆమాట మీకు చెబితే బాధపడతారని నాకు వ్రాసింది. ఇద్దరికీ ఇష్టంలేని వివా హం చేసుకున్నందువల్ల చేకూరే లాభమే ముంది? అందువల్లే ఆలోచించి మా ప్రొఫెసరుగారమ్మాయిని చేసుకున్నాను. ఇద్దరం కలిసి రేపే బయలుదేరి అమెరికా వెళ్ళిపోతున్నాము. ఇంటికి రావడానికి వ్యవధిలేదు ఒక సంవత్సరంలో తిరిగి వస్తాము మీరు అన్యథాభావించక నిర్మ లకు వెంటనే ఆమె ప్రేమించిన వ్యక్తితో వివాహం చేయమని, నన్ను క్షమించమని ప్రార్థిస్తున్నాను. అత్తయ్యకు నా నమ స్కారములు. పూర్తి వివరములతో తరు వాత మీకు వుత్తరం వ్రాస్తాను.

మీ మేనల్లుడు

రవికుమార్

"రవీ! మనయూనివర్సిటీ స్కాలర్ షిప్పై నీవు అమెరికా వెళుతున్నావు. మనదేశ సంప్రదాయాలను విస్మరించ కుండా మన ప్రతినిధిగా నీవు అక్కడ

సత్సాంప్రదాయాలను పాటిస్తావనే నా దృఢ విశ్వాసం. అక్కడ బహుజాగ్రత్తగా నీ విద్యను పూర్తిచేసుకో'' బేగంపేట విమానాశ్రయానికి రవి, విజయలకు వీడ్కోలివ్వడానికి వచ్చిన ప్రొఫెసరు అన్నారు.

నూతన దంపతులను సాగనంపడానికి చాలామంది విద్యార్థులు విమానాశ్రయానికి వచ్చారు. అందరిదగ్గరా సెలవు పుచ్చుకొని విమానమెక్కి అమెరికా బయలుదేరారు రవి విజయలు. బయలుదేరిన విమానంవైపు చూసి కళ్ళజోడు తీసి ఆనందబాష్పాలను తుడుచుకున్నారు ప్రొఫెసరు భాస్కరరావుగారు.

• • •

''ఏమిటండీ ఉత్తరం చదువుతూ చదువుతూనే అలా అయిపోయారు?'' హైదరాబాదునుండి ప్రొఫెసరుగారు రీడైరక్టు చేసిన ఉత్తరాన్ని చదువుకుంటున్న భర్తనుద్దేశించి అడిగింది విజయ.

''ఈ ఉత్తరం చదువు విజయా!'' అంటూ ఆ ఉత్తరాన్ని ఆమె చేతికందించాడు రవి.

బావా!

నేను నీకు వ్రాసిన ఉత్తరం ప్రభావం ఎలావుంది? అందరూ నన్ను అల్లరి పిల్లనంటారు. నీపైకూడా ఒక ప్రయోగం చేద్దామనుకున్నాను అయినా పిచ్చిబావా! నిజంగా దేవదాసు వయ్యావా? ఏప్రెల్ ఫస్టున ఉత్తరం వచ్చిందంటే అదేమిటో అర్థం చేసుకున్నావా? లేదుకదూ? నీవు ఏప్రెల్‌ఫూల్ వయ్యావు. నేను ప్రేమించి వివాహం చేసుకోవాలనుకున్న అమ్మాయిని నీవే. ఈ ఉత్తరం చదివయినా మనసు కుదుటపరచుకున్నావా? ఈ నాలుగు రోజులూ నిన్ను బాధపెట్టినందుకు క్షమించు. మరి నీవు ఇక్కడకు ఎప్పుడు వస్తున్నదీ తెలియచేస్తావుగా''

నిర్మల.

''హుఁ! పాపం. మిమ్మల్ని ఏప్రెల్‌ఫూల్ చేద్దామనుకొని తనే ఏప్రెల్‌ఫూల్ అయిపోయింది'' సానుభూతిగా విజయనుండి వచ్చాయా మాటలు.

• * •



# క్లీర్‌టోన్ కెటిల్ కొనండి-
# కాలమును, డబ్బును
# మిగుల్చుకోండి.

పాట్‌ప్యాన్ కెటిల్. లోపల వెండిపూత బయట క్రోమియమ్ పూతగలది
పరిమితి 1½ లీటర్లు (10 నుంచి 12 కప్పులు) 280 వోల్ట్‌లు ఏసి/డిసి 750 వాట్‌లు

**Kleertone**

క్లీర్‌టోన్ సాటిలేని విద్యుత్ ఉపకరణాలు

ది నేషనల్ రేడియో ఎండ్ ఎలెక్ట్రిక్ కంపెనీ లిమిటెడ్.
(జనరల్ రేడియో ఎండ్ అప్లయన్సెస్ డివిజన్)
బొంబాయి కలకత్తా ఢిల్లీ మద్రాసు



ULKA KL 2 Tel

# లిమబుక్కులు

—శ్రీ. శ్రీ

శ్వేతకుంజరాలు

తెల్ల కమ్యూనిస్టులు
రక్తపాతావి శపిస్టులు
విప్లవానికి బహిష్కులు
ఇందిరారాధనలో శ్రేష్ఠులు
నవభారత ధార్తరాష్ట్రీ రివిజనిష్టులు

హాళ్ళీసకం

వానారే గుళ్ళీ
బిగించి కారా కిళ్ళీ
ఇలా వచ్చావేం శాళ్ళీ
ఛప్పుకుంటూ మళ్ళీ
ఇక్కడేముంది సున్నకి సున్నా హాళ్ళకి హాళ్ళీ

పరిమిత వాదులు

నిన్నటి కమ్యూనిస్టులు
నేటి మర్యాదస్తులు
ఉదారవాదులు, సంపన్న గృహస్థులు
వ్యాపారైక దృష్టులు
తపో భ్రష్టులు

ష్వేళ

సమ్మెల వేళ
కవి సమ్మేళ
నాకేల గరోరి కూళ
వివరా దిగంతరాళ
కరాళ దిగంబర గ్రీవమేళ

సినీ సిజం

ఫిలిం ప్రపంచం ఫిల్తీ
అందులోదంతా కల్తీ
ఎలాగైనా లాభాల్తీ
సేందుకే సిద్ధం అందులో ప్రతీ శాల్తీ
దాన్ని జాతీయం చేయకపోవడం గల్తీ

ఆక్స్ఫ్రిజనులు

దిగంబర కవులు
ముళ్ళ గులాబీ పువ్వులు
ఆగ్రహ భార్గవులు
ప్రభువుల శిరసులపై పరశువులు
పగ పట్టిన చక్షుశ్రవులు

ఏంలాభం?

పెరిగితే వ్యాపార దృష్టి
మరిగితే లాభాల వృష్టి
దొరికితే అమెరికా ముష్టి
మిగిలేది విగ్రహ పుష్టి
నైవేద్య నష్టి

స్వాహాకార్లు

పిల్లికి బిచ్చం పెట్టని సాహుకారు
కుదరని మతపిచ్చి పట్టిన స్వాములారు
పెద్ద పెద్ద మాటల వెనుక దాగుతారు
డబ్బుతో రౌడీలను సాకుతారు
అంచేత కామ్రేడ్స్ పారా హుషారు

ఆరోగ్య స్నానం

విచిత్రమైన Vietna mization
అసహ్యమైన Syphilization
అసభ్యమైన Sexamination
అనుచితమైన cuntanination
అవసరం De-ancricanization

హూష్
స్పేస్
సుభాస్
చంద్రబోస్
లా సెభాష్
అంతా కామోష్

సమాజ శస్త్రవైద్యులు
విచిత్ర వీరులు నక్సలైట్లు
అన్యాయాలకి దైనమైట్లు
అంధకారంలో టార్చిలైట్లు
నవయువజీవన కాస్మోనాట్లు
వాళ్ళంటే హడలి పోతారు నిక్సనైట్లు

పత్రికా స్వాతంత్ర్యం
ఎడిటరయ్యవార్లంగారు
వీరస గంగాధరంగారు
పచ్చి వెలక్కాయ మింగారు
దిగంబరులంటే కంగారు
ఇత్తడే వాళ్ళకి బంగారు

మందులకు మందులు
ఎందుకు
లేదుంద బచ్చలి కెందుకు
అయినా వాంచేందుకు
నా ముందుకు
వస్తే ఇస్తా కాస్త మందుకు

అది వాళ్ళ తద్దినం
అప్పుల వాళ్ళ బాధ ఉంటే
తస్సాదియ్యా (సందే
హం లేదు) చాలా ఇబ్బందే
అయినా చెబుతున్నా ముందే
బాధ వాళ్ళదైతే సుఖం మన్దే

1963 లో
పిడుక్కీ బియ్యానికీ ఒకే
మంత్రం పఠించడానికే
తయారయింది చీనా. అందుకే
మావోకి చీవాట్లు పెట్టిందికే
వెళ్ళింది సిరిమావో బండారనాయకే

1970: లంకా జనాస్సుఖినో భవన్తు
సింహళదేశపు వోటర్లు
సిరిమావో వెపరేటర్లు
పిల్ల వాళ్ళకి ధర్మామీటర్లు
విద్యుచ్ఛక్తి జెనరేటర్లు
వాళ్ళే అమెరికాకి వాటర్లూ

వివాదాంధ్ర
దిక్కులేని దివాలాంధ్ర
పెంట మీద పిశాచాంధ్ర
కృత్త పుచ్ఛ సృగాలాంధ్ర
మత్తతుచ్ఛ మసాలాంధ్ర
వెర్రెత్తిన విషాదాంధ్ర

సినీ మాయ
పీతి సీమా
ల్లేవి సినీమా
ముందు ప్రణామా
లెందుకురా అది మసీమా
రైట్ ఎసీమా

క్రిమినల్లులు
క్రిమినల్ సెక్స్ క్రిములు
పురజనుల మూలుగులు నములు
అవి పిండిన పత్రికలేయములు
వాటివి ప్రకటించే వరాధములు
ఆ క్రిములతోనే నములు

—— ——

# రాక్షసీ, నీ పేరు రాజకీయమా? వర్ధిల్లు!

మొట్టమొదట కనకంగారూ, ఆ వెనక లోకనాథంగారూ వారివెనుక మరో యిద్దరు పెద్దలు గదిలోకి వచ్చారు. వాళ్ళు రావడంతోనే వాళ్ళంతా రామదాసుగారికి నమస్కారాలు చేసేరు. నమస్కారాలన్నీ స్వీకరించి కళ్ళతో పలకరించారు రామదాసు.

కనకం అన్నాడు-

"ఏమిటి ఈ మధ్య బొత్తిగా మీ దర్శనాలు తక్కువై పోయేయి."

లోకనాథం అన్నాడు-

"వంట్లో సుస్తీగాని చేయలేదుగదా?"

నరసయ్య సమాధానం చెప్పబోయేడు గానీ, రామదాసు కళ్ళతో హెచ్చరించగా నోరుమూసుకున్నాడు.

"నాకేం బావా విశేషంగా వున్నాను. ఎండలుగదూ కొంచెం నలిగేను. అంతే!" అన్నాడు రామదాసు.

"అవును బావా! చెడ్డమంటి పోతున్నాయి ఎండలు!" అన్నాడు లోకనాథం.

"గత పదేళ్ళుగా ఇంతోటి ఎండల్ని నేనెరుగనంటే నమ్మండి." అన్నాడు నక్షత్రకాయ పెద్ద.

"చోద్యం కాకపోతే ఎండలింత మండిపోవడమేమిటప్పుడు మరీనూ..." అన్నాడు రెండో పెద్ద.

"మీ ఎండలు తగలడిపోనూ. వచ్చిన పని మరిచిపోయి వచ్చి రావడంతోనే ఎండలెత్తుతున్నారేమిటయ్యా బాబు!" అన్నాడు వణుమండిపోయి కనకం.

"అయితే, మీరాకకి కారణమేమిటో చెప్పండి దాచడమెందుకు?" అన్నాడు రామదాసు.

"ఏమీలేదు బావా! మొన్నీ మధ్యనూ ఆడంగులు విజయనగరం వెళ్ళేరు. అక్కడికి మహానుభావుడు స్వామీ విశేషానందులొచ్చి గొప్ప ఉపదేశం చేసేరుట. గమ్మ

• ధనిష్ఠం •

త్తేమిటంటే ఈ స్వామి కొత్తగా కుర్ర స్వామిట. ఎంతో అందగాడుట. మా అడంగులు తిరిగిఇంటికొచ్చిన దగ్గర్నుంచీ ఆ స్వామిని మన తిమ్మాపురానికి పిలి పించవలసిందిగా నా ప్రాణం తీసేస్తోం దనుకో! చెప్పద్దూ-నేను ఉపప్రభువైన దగ్గర్నుంచీ. ఎవరో ఒక స్వామిని పిలి పించుకుని ఉపదేశం పొందుదామని గొప్ప ముచ్చటగా వుంది. బావగారంత స్టేటస్ నాకు ఎట్లాగూలేదు. అందుచేత వారంత ఘనంగా కాకపోయినా, నాచేతనైనంతలో నేనూ ఒక స్వామికి సత్కారంచేసి ముచ్చట తీర్చుకుందామని ఉద్దేశం. కన కాన్ని అడిగేను కుర్రస్వామి గురించి చెప్పేను. బావని గూడ కనుక్కుని ఏర్పాట్లు చేద్దామని కనకం అన్నాడు. అందుచేత వచ్చేం.''అన్నాడు లోకనాథం.

రామదాసు చాలా ఖచ్చితంగా అనే సేడు.

''మొన్నేగా స్వామీజీ వచ్చి వెళ్ళేడు. మళ్ళా ఈ కుర్రస్వామి ఎందుకు చెప్పు? ఈ స్వాములొచ్చి వెళ్ళే ప్రతీసారీ గుళ్ళు కొట్టించుకోడమంటే చిరాగ్గా వుందోయ్ బావా! నువ్వూ ఆలోచించు''

లోకనాథం వెంటనే సమాధానం ఇచ్చాడు

''చెప్పడం మరిచేను. ఈ స్వామికి అట్లాంటి పట్టింపులేవుట. గుళ్ళు కొట్టించుకునే అవసరం మనకుండదు. ఎంచక్కా క్రాపులే వుంచుకోవచ్చు వంటి నెట్లాంటి గుడ్డలున్నా పర్లేదుట. నాక్కావలసింది మీ మనసులేగాని మీ వేషాలు కావు' అన్నారుట వారుగూడ ఎంతో సాధారణంగా మనందరిలాగ వుంటార్ట!'

''చంపావ్‌పో! పాపం, ఈ స్వామి ఎవరోగాని ప్రజల్లో పెద్ద డిమాండ్ సంపాదించుకోలేడు. ఏమంటే—చక్కగా గుళ్ళు కొట్టించుకుని, స్నానం చేసి, విభూతి పెట్టుకుని! మడిగట్టుకుని స్వామిని దర్శించే ఏర్పాట్లలో వున్న 'విలువ' ఏదో సినిమాకెళ్ళినట్టు మైల బట్టల్తో, నానిన గొట్టె వంటితో స్వామిని దర్శించడంలో ఎక్కడుంటుంది చెప్పు!'' ఏమంటావ్?

''ఆ. అదంతా నీ పిచ్చిగాని బావా! స్వామి స్వామే! ఇవాలివ్వవలసింది స్వామిగాని ఆచారాలు కావుకదా. అయినా, అవన్నీ నాకొదిలేయ్ నేను నరుక్కొస్తానుగా

''అవును లోకం బావా! దీనివల్ల నువ్వు సాధించే ప్రయోజనమేమిటో చెప్పు వింటాను.'' అన్నాడు రామదాసు.

లోకనాథం ఆ ప్రశ్నకి అదిరిపోయేడు. కనకాన్నీ, మిగిలిన ఇద్దరు పెద్దల్నీ గబగబా చూసేడు. వాళ్ళ మొహాల్లోనూ ఆశ్చర్యం తాండవించడంతో, లోకనాథం ధైర్యంచేసి అడిగేడు రామదాసుని—

''అయితే బావా! నువ్వూ స్వాముల్ని పిలిపించుకున్నావుగదా, వాళ్ళొచ్చినందువల్ల నువ్వేం సాధించేవు?''

అంత ప్రశ్న అంత సూటిగా వొచ్చినందుకు రామదాసు మినహా మిగతా వాళ్ళంతా విని భయపడ్డారు.

రామదాసు ఆ తిక్క ప్రశ్నని చాలా



సులువగా తీసుకుని నిజాన్ని నిశ్చయంగా చెప్పేరు—

"నేను పురప్రభువుని బాబా! మీ అందరికీ ప్రభువున్నేను. మీ బాగోగుల

## జరిగిన కథ కవరావిరాఘు

తిమ్మాపురం పురపాలక సంఘ ప్రెసిడెంటు రామదాసుకు ఆస్తి అంతస్థు అన్నీ ఉన్నాయి. ఆయన వారసుడు చిరంజీవి కాలేజీ ఎలక్షన్‌లో నిలబడి గెలిచాడు

ఆ కాలేజీలోనే చదువుతున్న వరప్రసాదంతో పరిచయం పెంచు కున్న సుమతి అకస్మాత్తుగా ప్లేటు ఫిరాయించి చిరంజీవి వైపు మొగ్గుతుంది.

సుమతి చిరంజీవుల ప్రేమ గురించి సీతాపతి సక్యంతో చెప్పగా వారిద్దరికీ మాటమాటా పెరిగింది. ఒక రోజున సీతాపతి ప్రసాదును కారులో బీచ్‌కు తీసుకు వెళ్ళి సుమతి చిరంజీవి ఒకరిలో ఒకరు ఏకమయ్యే దృశ్యాన్ని చూపించాడు.

మీరు త్వరలో తండ్రి కాబోతున్నారని సుమతి, చిరంజీవితో చెప్పగా గర్భ స్రావం చేయించుకోమని సలహా ఇచ్చాడు ఆ తరువాత చిరంజీవి సుమతిని కలవడమే మానేశాడు.

సుమతి తన గాధనంతా ప్రసాదంతో చెప్పగా ప్రసాదం రామదాసు గారితో మాట్లాడదామని వెళ్ళి, ఆయనచేత అవమానింప బడతాడు.

రామదాసుగారు చిరంజీవి ద్వారానే అతని ప్రేమ కథను తెలుసు కుని తన గతస్మృతులు గుర్తుకు వచ్చి ఎదో షాకు తగిలినట్టవు తుంది.

యూత్‌పార్టీ మహా సభలకు చిరంజీవి మైసూరు వెళ్ళాడు. రామ దాసుగారు సీతను కలుసుకుని తన ఇంటికి రమ్మన్నారు. సీత అందుకు నిరాకరించింది రామదాసుగారు ఆ దిగులుతో మంచం పట్టి సర్వస్వము పిలిచి చిరంజీవికి రాజకీయ చిట్కాలు నేర్పమన్నారు.

ఇక చదవండి.

---

యందూ. మీ అభిరుచులందూ. మీ కష్ట సుఖాలయందూ శ్రద్ధగలవాడినని బోర్డు కట్టుకున్నాను. మీకేం కావాలో. మీకేం యిష్టమో తెలుసుకుని అవి మీకు ఏర్పాటు చేస్తే వదికాలాలపాటు మీ అందరి అభి మానాన్ని తింటూ నా 'ఉనికి'ని నేను కాపాడుకుంటాను. అందుచేత. మీరు స్వాములు కావాలన్నారు గనుక ఏడాదికో సోమరిపోతుని వెతికి పట్టుకొచ్చేసి గుండు చేసుకున్నాను. మహాభక్తుడి పోజు పెట్టి. విభూతి మొహాన్ని తానుకున్నాను. మీకు వేనెలావుంటే వచ్చుతానో అక్షరాలా అలా వుండి దేన్నా చేసేను. అందువల్లనే నేటింకా మీ అందరికీ ప్రభువుగా చలా మణి అవుతున్నాను ఇదీ నేను సాధిం చింది. అయితే నువ్వుకూడా యాదే ఆశి స్తున్నావా?''

లోకనాథం. రామదాసుల మినహా యించి మిగతా వాళ్ళంతా ఒక పెద్ద అహా





తంలో పడిపోతున్నట్టు భ్రమ పడుతున్నారు.

లోకనాథం తొణక్కుండా అనేసేడు-

''అవును బావా! సరిగ్గా నేనూ అదే అంటున్నాను. నీ తర్వాత నేనే ప్రభువుం ఉపప్రభువుని. మవ్వాని మరిచి పోకూడదు

రామదాసు నవ్వి అన్నాడు-

''మరి..నిను మరిచిపోయే ప్రమాదం జరగదు. మనం ఇల్లాంటి తప్పుడు పనులు చాలా చేయాలి. నిజమే! కాని బావా, మన తెలివిని అల్లావుంచి—ఇంకో పక్క. మన తెలివివల్ల ఏం జరుగుతోందో తెలుసా! ఈ తిమ్మాపురంలో బద్ధకస్థుల్ని తయారు చేస్తున్నాం ఎక్కడ్నుంచో దిగు

మతి చేసుకుంటూన్న సోమరిపోతులను అందలాలెక్కించి వీళ్ళలో అహంకారాన్ని పెంపుతున్నాం. వాళ్ళకి దండలేయటం భజన చేయడం అపకపోతే బావా కొంతకాలంలో స్వాముల సంఖ్య పెరిగి సామాన్యుల సంఖ్య తగ్గిపోతుందేమోనని నా భయం! ఇప్పటికీ మన ముచ్చట తగ్గకపోతే దీనికో చిట్కా చెబుతా విను. ఎక్కడ్నుంచో ఎవరో స్వాముల్ని తీసుకొచ్చి మెడల మెండికగానీ-మనూళ్ళో మనమధ్యనే వెతుకు. మన సొమ్ము మనూళ్ళోనే ఉంటుంది. మన చెప్పుచేతల్లో వుండి మనకెదురాడని మనిషిని పట్టుకో. వాడికి గుండుకొట్టించు. కాషాయ వస్త్రాలు తొడిగించు. కమండలం వగైరా సామాగ్రి సంపాయించి యివ్వు. జెకం కర్ ...నడం నేర్పు అ స్తమానం కళ్ళు మూసుకోడం మంచిదను. సాధ్యమైనంతవరకూ నోరుమూసు కూర్చో మను. నోరు విప్పితే రాముడూ దేవుడూ లాటి శబ్దాలొచ్చేట్టు ట్రైనింగివ్వు. ఒక్క సంవత్సరం చాలు-మనూళ్ళో తయారైన స్వామి దేశాన్ని ఏలేస్తాడు. నీకాభయమొద్దు ముందు మనిషిని వెతుకు. అన్నట్టు ఎవడో ఎందుకు? మన నరసయ్య చాలు తయారుచేసే నేర్పే వుంటే ఆరు నెలలలో నరసయానంద స్వాములయిపోడూ ఏమంటావ్? ' అని యింకా నవ్వుతూనే వున్నారు.

వొచ్చిన మనుషులంతా ముక్కుల మీద వేళ్లేసుకున్నారు. రామదాసుగారేనా యిలా మాట్లాడేదని వాళ్ళు ఆశ్చర్య పోయేరు. వారిలో ఇంత మార్పెందుకు వచ్చిందో అర్థంగాక ఆశ్చర్య పడటం మాని ఆలో చనలో పడ్డారు లోకనాథం.

నరసయ్యకి మాత్రం చెడ్డ భయంగా వుంది.

(ఈ స్వాముల ప్రసక్తి కేవలం పాత్రల మధ్య వచ్చిందేగాని, దీనికి రచయిత ఏ మాత్రమూ బాధ్యుడు కాదు. మనిషిని దోచేది స్వామి ఒక్కడేనని రచయిత అభిప్రాయం కానేకాదు పోగా- ఈ చర్చలో ప్రత్యేకించి రచయిత ఉద్దేశం యిక్కడరాయడంగానీ. ఎక్కడ ఎవరితోనైనా చెప్పడంగానీ జరగని పని ఇంక చదవండి.

—రచయిత)

నవ్వుని ఒక చోట ఆపి, గుండె పట్టుకుని ఆయాస పడుతో అన్నారు రామదాసు—

"నీ విషయాల్లో నా జోక్యం మెందుగ్గాని లోకం! కుర్రస్వామిని నీ ఇష్టానుసారమే పిలిపించు. ఉపదేశం పొందు. నన్ను మాత్రం ఆ ఛాయలకు పిలవకు వెళ్ళు."

లోకనాదం లేచేడు కనకంతో పాటు ఇద్దరు పెద్దలు లేచేరు. నరసయ్య మాత్రం లేవలేదు.

వాళ్ళు నలుగురూ గది గుమ్మందాటబోతూండగా రామదాసు జనాంతికంగా ఒక ప్రకటన చేసేరు.

"లోకం బావా! నేను నా పదవికి రాజీ

నామా యిద్దామనుకుంటున్నాను నీకు సంతోషమేనా?"

బాబూ ' అన్నాడు నరసయ్య

లోకనాథంతోపాటు మిగతా ముగ్గురూ ఆ ప్రకటన విని చకితులయ్యేరు వెంటనే ఆ గది విడిచి పోవాలని వాళ్ళ కనిపించ లేదు అందుచేత వాళ్ళు గుమ్మం దగ్గిరే నిలబడి పోయేరు

"నిజమేనోయ్ బావా! ఆశ్చర్యపోమాకు వెధవది-నీ మొహంలో అది ఆనందమో ఆశ్చర్యమో తెలీడం లేదుగాని-ఏర్పాట్లు మాత్రంచేయించు నాకీ పదవి తగదు నేను చక్కబెట్టుకోవలసిన వ్యక్తిగత విషయాలు చాలా వున్నాయి చాలా ఏళ్ళు మత్తులో వున్నానుగదా ఇప్పుడైనా కళ్ళు తెర వకపోతే ఎల్లా చెప్పు? ఈ పదవికీ నా సమస్యలకీ బొత్తిగా పడదు అందు చేత పదవి నొదులు కుంటున్నాను ఇంక వెళ్ళండి నమస్కారం

వాళ్ళు వెళ్ళిపోయేరు గదిలో మిగిలి వున్న నరసయ్య కదల్లేని స్థితిలో వున్నాడు అతన్ని చూస్తో అన్నారు రామ దాసు

"నరసయ్యా గుండెపోటు ఎక్కు వవుతోంది చావనుగాని భయంగావుంది ఆ మాట కొస్తే నేను త్వరగా చావ కూడదు కొన్ని మంచిపనులు చేయా లనుకుంటున్నాను వెళ్ళి డాక్టర్ని తీసు కురా ఇంకా ఓర్చుకునే శక్తి నాకులేదు దొంగ డాక్టరు దగ్గిర కెళ్ళకు దొంగ డాక్టరొస్తే నాది దొంగ జబ్బనుకుంటాడు మంచి డాక్టర్నే పిలు వెళ్ళు '

నరసయ్య విసిరిన బాణంలా ఆ గది నుంచి బయటకు పరుగెత్తాడు

# 13

త్రియ్యాపురం యావత్తూ అలజడిగా వుంది

పెద్ద వర్గాల్లోనూ చిన్న నాయకు ల్లోనూ కాబోయే రాజకీయ వస్తాదుల్లోనూ కంట్రాక్టర్లలోనూ ఈ వార్త ఒద్దూ రంగా గొప్పషాక్‌గా నమ్మలేని నిజంగా పనిచేస్తోంది

పురప్రభువు పదవికి రామదాసు గారెం దుకు రాజీనామా యిచ్చేరో ఎవ్వరికీ సరైన కారణంతో తెలీడం లేదు

రామదాసు గార్ని పరామర్శించడానికి వెళ్ళిన పెద్దలు తెల్ల మొహాల్తో తిరిగి వస్తున్నారేగాని 'రాజకీయ రహస్యాల్ని' తెలుసుకోలేక పోతున్నారు

వారు రాజకీయ జీవితంతో విసిగి పోయేరా? వత్తిడేపైనా పరోక్షంగా వచ్చిందా? కొంప మీసి కొచ్చే పమ యాన్ని కనిపెట్టి నిష్క్రమించేరా? లేక వైరాగ్యమా?—ఏదీ తేల్చి చెప్పలేని పరిస్థితిలో ప్రజలు రకరకాలుగా వూహించి రకరకాల కట్టు కథల్ని ప్రచారంలో వుంచేసున్నారు

—రైల్లోనే తండ్రి రాజీనామా వార్తని తెలుసుకుని చిరంజీవి నివ్వెరపోయేడు

మహాసభలో తనకి పరిచయమైన కుర్రనాయకులు కారణాన్ని' అడిగేరు తెలీనంటూ పెదవి విరిచేడు చిరంజీవి కాని తన 'పాడు కథ కారణమై

ఖుంటుందేమోనన్న బెంగమాత్రంఅతన్ని వదల్లేదు ఆ ప్రక్కనే-తండ్రి ఈజన్మకి మంచి పన్నాసి కాలేదనే చిన్న ఆశ ఆ బెంగని కొట్టి పారేస్తోంది

ఎవరో సుమతి అనే ఆడపిల్లతో అక్రమ సంబంధం పెంచుకుని ఆపిల్లని అన్యాయం చేసేడనే ప్రవారం (బహుశా ఆ స్థితికి ఎదిగుండదు కథ) వల్ల తండ్రి రాజీనామా చేసేయ గలడా?

చిరంజీవి రైలు దిగి వేగంగా యింటికి వెళ్ళేడు గుమ్మంలోనే ఎదురయ్యేడు తండ్రి ఆయన్ని చూచి అక్కడే ఆగిపోయేడు కొడుకు చేతిలోని సూటుకేసు కింద పెట్టి అడిగేడు

"నేను విన్నది నిజమేనా నాన్నా?

సమయాంకి వచ్చేవురా నీ పని మీదే బయటకు వెళ్ళబోతున్నాను నాకు శ్రమ తగ్గి చేవ్ రా చెబుతా అక్కడ కూచో! అన్నారాయన సోఫా చూపిస్తూ

తండ్రి కొడుకు లిద్దరూ కూచున్నారు

"నేనడిగిందాంకి సమాధానం చెప్ప లేదు నాన్నా?

"రాజీనామా గురించేనా?

''అవును నిజమేనా

"నిజమేరా! రాజీనామా చేసేను ''

''ఎందుకు చేసేవ్?

'మంచికోసం?

"మంచికోసమా? మంచే మిటి నాన్నా? '

"మంచి అంటే ఏమిటని అడుగు తావుంటుంది నీకు మంచేమిటో చెప్పే ఓపిక నాకు లేదుగానీ ఇక ముందు నేను చేయబోయేదంతా మంచే! నేను చేస్తున్నది చూసి మంచేమిటో నేర్చుకో

''ఆ మంచి పదవిలో వుండే చేయ వచ్చుగా!

రామదాసు నవ్వేరు____

' నా పదవిని అడ్డం పెట్టుకుని ఎదగా లనుకుంటున్నావు కదురా నువ్వు! ఆ ఆశని తుంచేయాలనే రాజీనామా చేసేశా! అదొక మంచి ముఖ్యమైన మంచి మరి కొన్ని నెమ్మదిగా అర్ధమవుతాయి నీకు "

చిరంజీవి బాధపడ్డాడు చాలా దిగులుగా అన్నాడు

'కలీక నేను పాడు పనేదైనా చేస్తే నువ్వు హెచ్చరిస్తే నేను దిద్దుకోనా? ఇంత మాత్రానికే నువ్వు రాజీనామా యివ్వాలా?

' నేనా పదవిలో వుంటే నువ్వు నా చేతికి అందవురా ఆల్బీ!

' మరి మరి సింహాసనం నాకెక్కడ నాన్నా? '

' నీకు సింహాసనమిస్తే ప్రమాదం '

మనపు నా కెందుకు ఆశ పెట్టేవ్

' అందుకే యిప్పుడు నేను సింహాసనం దిగేను '

"నన్నిప్పుడేం చేయమంటావ్?

బుద్ధిగా చదువుకుని బాగు పడమంటాను '

"మ రాజకీయం?

''వదిలెయ్ '

"మా వాళ్ళంతా నా మీద ఆశలు పెట్టుకున్నారే! "

''మైసూర్ మహాసభల్లో కలిసిన మీ వాళ్ళా?"

"అవున్నాన్నా!''

"ఇక సభల కెళ్ళకు. మన్విప్పటి వరకూ సక్రమంగా పెరగలేదు. మనవి వంకర బుద్ధులు ఈ బుద్ధులు రాజకీయంలో తగలేస్తే రాజకీయమే తగలడిపోతుంది. వంకరగా తయారై వంకరగా ప్రజల్ని తింటుంది ఇది మహాపాపం.''

చిరంజీవికి కోపం వచ్చేసింది—

"అంటే ఈ పాపం మీకు ఇప్పుడే అర్థమైందా నాన్నా?''

"అవున్నాయనా, సుమతి కథ తెలీక పోతే యెప్పుడూ అర్థమయ్యేది కాదు ''

"సుమతి?''

''నీ భార్య!'

చిరంజీవి కొంచెం నెమ్మదించేడు. చాలా కూపీగా అన్నాడు.

"నాకు తెలుసు నాన్నా! నేను అను కుంటూనే వున్నాను. సుమతికి నేను అన్యాయం చేసేనని తెలిసి నువ్వా నాడు బాధ పడ్డావు. క్షమించునాన్నా! నీ మాటకి ఎదురాడనింక! నేను సుమతిని తప్పకుండా పెళ్ళి చేసుకుంటాను. నీ రాజీనామాని ఉపసంహరించుకో.''

''ఏలహో యువ్వకురా పూల్! రాజకీయానికి నువ్వుగానీ, నేను గానీ తగం. రాజకీయంలో పడి పడటంతోటే మనకి వళ్ళు తిమ్మిరెక్కి మనల్ని మనం మరిచి పోతాం. ముందు....వెంటనే నువ్వు సుమతి వాళ్ళింటికి వెళ్ళు. వెళ్ళి అమ్మాయికి క్షమాపణలు చెప్పుకో మళ్లా మీ యిద్దరూ కలిసిక్కడకి రండి. '

---

ఒకరోజున మాష్టారు పిల్లలందర్నీ వారికి తోచిన బొమ్మలు వేసుకురమ్మన్నారు

ఒక పిల్లవాడు తెల్ల కాగితం ఇచ్చాడు

అప్పుడు

టీచరు - ఈ బొమ్మేమిటి?

పిల్లవాడు - ఆవు గడ్డిని మేయుట అని జవాబిచ్చాడు.

టీచరు - మరి గడ్డేది?

పిల్లవాడు - ఆవు తినేసింది.

టీచరు - మరి ఆవేది?

పిల్లవాడు - గడ్డి తినేసి వెళ్ళిపోయింది. —ఇందిర

"నాన్నా!
'అంతే!'
నువ్వు నీ రాజీనామాని ఉపసంహరించుకోవుగాని నేను సుమతిని పెళ్లాడాలి అంతేనా?"
'రాజీనామాకీ సుమతికీ సంబంధమేమిట్రా ఫూల్! సుమతి నీ భార్య!
చిరంజీవి వేడి మీద అనేసేడు -
నువ్వు రాజీనామాని ఉపసంహరించుకోక పోతే సుమతి నాకు భార్యగా రాదు''
రామదాసు ఫెళ్ళున నవ్వేసేరు నవ్వి అన్నారు
''నువ్వీ మాట అంటావని నాకు తెలుసురా నాన్నా! సుమతి నీకు భార్యగా ఈయింటికి రాకపోతే ఈ యింట్లో నీకు స్థానమేలేదు చాలా నిర్ణయాలు నేనింతకు మునుపే చేసుకున్నాను ఆపిల్లకి అన్యాయం చేసి నువ్వెక్కడికి పోతావో నేనూ చూస్తాను ఆ పిల్లనీకు భార్యకాకపోతే నాకు కోడలురా రాస్కెల్! కొడుకూ కోడలూ అన్నీ ఆ పిల్లే నా స్వార్జితమైన ఇంత పెద్దమేడకీ ఇంత ఆస్తికీ ఆపిల్లే సర్వాధికారిణి! అండర్‌స్టాండ్ దెన్ గెటప్! గెటవ్ ట్ అఫ్ మై సైట్ యూస్కౌండ్రల్!"
మొట్టమొదటిసారిగా తండ్రికోపాన్ని రుచి చూచిన చిరంజీవి నిలువెల్లా వణికిపోయేడు రుద్రుడి రూపంలో కనుపిస్తున్న తండ్రిని భయంగా చూస్తూ—
'నాన్నా! అన్నాడు
'నన్నంత మెత్తగా పిలవకు నన్ను మెత్తగా పిలిచి మళ్ళీ నన్ను దుర్మార్గుడ్ని చేయకు వెళ్ళిపో గో నీయిష్టమొచ్చిన సభలకెళ్ళి అక్కడ చేరిన నక్కలూ పులులూ, సింహాల్తోటి చేతులుకలిపి మనిషిగా సర్వనాశనమైపో! వెళ్ళిపోరాగాడిదా! నువ్వు కదికరించకపోతే సుమతి బతకలేదనుకుంటున్నావేమో ఆ పప్పులు నా దగ్గిరుడకవు చెబితే నే సుమతి నా కొడుకూ కోడలూ సర్వం అది నేనిప్పుడే వెళ్ళి ఆ పిల్లని తీసుకొస్తాను మేము వచ్చేవేళకి నువ్విక్కడుంటే— నీ రక్తం కళ్ళజూస్తాను తమాషాకి అనడంలేదు నిజమే అంటున్నాను తర్వాత నీయిష్టం! అని ఆయనలేచి వెళ్ళబోయేరు
చిరంజీవి వణికిపోతూ అన్నాడు
'ఆగు నాన్నా! నువ్వు వెళ్ళకు నేనే వెడతాను ఇప్పుడే వెళ్ళి సుమతిని తీసుకొస్తాను నువ్వు చెప్పినట్టు చేస్తాను నువ్వు కూచోనాన్నా వెళ్ళకు
రామదాసు ఆగిపోయేరు వచ్చి సోఫాలో కూచున్నారు కూచుని అన్నారు
'అలాగే నీవే వెళ్ళు వచ్చేప్పుడు లాయరుశాస్త్రి రమ్మన్నానని చెప్పు అట్లాగుడ్లప్పగించి చూడకు రాతకోతలన్నీ ఇవాళే పూర్తికావాలి ఇక నీబతుకు నీభార్య చెప్పుచేతల్లో వుంటుంది అర్థమయ్యిందా? అయితే వెళ్ళింక
రైలు దిగివచ్చిన వాడు వచ్చినట్టే సుమతి వాళ్ళింటివేపు కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళేడు చిరంజీవి

(సశేషం)

# గాలిబ్ రాసిన ఉత్తరాలు

## 8

10 డిసెంబరు 1852

విన్నవే నీ ఉత్తరం అందింది-చదివిన వెంటనే మనసులో ఏదో చలనం ప్రారంభం అయింది కొత్త సత్యం తలుపులు తెరుస్తున్నట్లు తోచింది-నీకు సలహా ఇవ్వబోయే ముందు నన్ను నేను ప్రశ్నించుకోవాలి

లేదా భగవంతుడివి-అల్లా నువ్వే ఆ పరిస్థితిలో వుంటే అవి అడగాలి ఏదీ చేయకుండా చెప్పలేను-నువ్వూ అలాగే చెయ్యి జీసస్ చెప్పినట్లు పాపం చెయ్యని వాళ్ళే రాళ్ళు విసరాలేమో

స్నేహితుడు స్నేహితుడేకాని శీలవంతుడు కావాలని ఎక్కడా లేదు

ఏ సంయోగం అయితే సంతోషాన్నివ్వదో దానికంటే వియోగం సుఖమైనది అసలు విషయం నీ అభిప్రాయం బాగానే వుంది ఆ కవికి నీకూ కూడా ఏ సలహా యివ్వలేని స్థితి నాది కాని ఏం చెయ్యాలో తెలియటం లేదు

స్పష్టంగా కనుపించే ఈ లోకంలోని అపూర్వ రహస్యం ఇప్పుడిప్పుడే చూడగల్గుతున్నాను నేను ఇట్టి పరిస్థితిలో గత్యంతరం లేక ఇక్కడ వున్నాను హాః పెద్దవాడినయిపోయినాను దానికి తోడు చెవులు వినపడటం లేదు

---

లత

---

ఇంగ్లీషు సర్కారులో కూడా పెద్దవాడిననిపించుకోలేదు గొప్ప వంశంలో పుట్టాను కీర్తికి అంతే లేదు కాని ఇప్పుడవేమీ లేవు ఒక్కడినీ ఎక్కడికీ పోలేను కవీనం సన్యాసిని కూడా కాలేను

మైత్రీ బీజం నాటబడ్డదిగాని ఎప్పుడు ఫలిస్తుందో తెలియదు హాలీవుడ్లో ఒంటరిగా పిల్లలతో వుంటున్నాను ఆగ్రా కూడా పారిపోవాలేమో తెలియదు ఆత్మాభిమానంతోనే ఇంకా బ్రతుకుతున్నాను

అసదుల్లా

# 9

మొన్ననే ఉత్తరం వచ్చింది మనం అనుకున్నట్టే జరిగింది గజల్స్ చదువుతున్నాను సాయంత్రానికి పూర్తి చేస్తాను రేపు వాటిని పంపించేస్తాను సరిగ్గా ఇప్పుడే జానీ ఉత్తరం వచ్చింది అందుకే ముందు ఉత్తరం వ్రాయకూడదనుకున్నా మళ్ళీ వ్రాస్తున్నాను

రాజర్షి సలహాతో నా అర్జీ అందుకున్నాడు జానీజీ ఇంగ్లీషువాళ్ళు ద్రోహులు కూడా వాళ్ళు నిర్ణయిస్తున్నారు అర్జీ మాత్రం అందింది ఫలితం ఏమయిందో మరి-జానీజీ నీ కోసం చూస్తున్నాడని విన్నాను

పాము చావకుండా కర్ర విరగకుండా బ్రతకాలి నేను

అసదుల్లా
25 ఫ్రిబవరి 1853

# 10

హరీ!

మొన్న సాయంత్రం నీ ఉత్తరం జానీజీ ఉత్తరం రెండూ అందినాయి— రెండు రోజుల నుంచీ గుండె నొప్పితో బాధ పడుతున్నాను బాబూసాహెబ్ కాగితాలు రెండు మూడు రోజుల్లో పంపిస్తాను

అసదుల్లా




# సెక్స్ చిత్రాల నిర్మూలన

—కర్రి దివాకరరావు

జూలై "జ్యోతి"లో శ్రీమూర్తి (బరంపురం) గారి వ్యాసం అసంపూర్ణమని భావించి ఇది వ్రాస్తున్నాను. నేడు మన తెలుగు చలన చిత్ర సీమలో సంవత్సరానికి ఒకటి రెండు చిత్రాలు తప్ప మిగిలినవన్నీ వ్యాపార సరళిలో సంఘ విచ్ఛిన్న శక్తులైన చవుక బారు శృంగారం తోను, అవాస్తవిక సన్నివేశాలతో నిర్మితమయి ప్రేక్షకులకు కోత పుట్టిస్తున్నాయి! వీటికి కారకులెవరన్నది సమస్య! చిత్రాలను ఆదరించే ప్రేక్షకులతోపాటు సాంకేతిక నిపుణులు, మన రాజకీయ నాయకుల వరకూ కారకులే! ఎందుకంటే ఇప్పటి మన చిత్రాల లోని కొన్నిసన్నివేశాలనుచర్చిద్దాం! తను పేదస్త్రీగా సృష్టించిన కథానాయికను, పాత్ర స్వభావాన్ని విడమరిచి నటి యొక్క రూపాలావణ్యాలను మెరుగు పరచే విలువయిన వేషధారణ గావించిన చిత్ర నిర్మాత, దర్శక, కళాదర్శకులను ''శహబాష్' అని అభినందించే రచయితలు తల్లిదగ్గర ఫోజులిమ్మి పెళ్ళాందగ్గరవిలన్ నవ్వునవ్వే కథానాయకులు, సరస లేని చవుకబారు హాస్యం అసహజమైన పాత్రల సృష్టి, సన్నివేశ పుష్టిలేని సంగీతబాణీలు, అర్థంలేని చిత్రానువాదం, డైలాగ్సును మించేశబ్ద గ్రహణం, సాంప్రదాయ విరుద్ధమైన అర్థంలేని పాటలు అసంపూర్ణమైన దర్శక ప్రతిభ మనకు మనచిత్రాలలో గోచరిస్తాయి!

ఈనాడు మన చిత్రాలలో వస్తున్న అసభ్య శృంగార దృశ్యాలకు కారణం ఏమిటి? పన్నెండు సం॥ల పిల్లలకు సైతం అందుబాటులో నున్న శృంగార పుస్తకాల భావ చాంచల్యానికి మానవ సహజమైన దుర్గుణాలు లాంటి అసభ్య శృంగార ప్రదర్శితమయిన విదేశీ

చిత్రాలపై మోజు చూపుతున్న ప్రజానీకం! "మనుషులు మారాలి" వంటి [illegible] చిత్రాన్ని ప్రేక్షకులాదరించరు. "ఏకవీర" బంగారు సంకెళ్ళు "కీలుబొమ్మలు" వంటి చిత్రాలను ఎటువంటి ఆదర్శ ప్రేక్షకులు చూశారు? మన చిత్రాలలోని సెక్సును చూచే ప్రేక్షకులు చిత్రాలను ఆదరిస్తున్నారా అంటే అదీ కూడా కాదు. అర్ధనగ్న ప్రదర్శనలతోను, అసభ్య శృంగారాలతోను నిర్మించిన "భలే మాష్టారు" "నేనే మొనగాణ్ణి" వంటి చిత్రాలను ప్రేక్షకులు తరిమి కొట్టారు కూడా. అయితే మన ప్రేక్షకుల నైజం ఏమిటన్నది ప్రశ్నగా మనకు మిగులుతుంది.

ఒక చిత్రం యొక్క శత దినోత్సవ సభకు అధ్యక్షత వహించి గౌరవనీయులైన ఒక మంత్రి వర్యులు ఆనాటి సభలో మాట్లాడుతూ ఇలా అన్నారు 'ఈ నాడు కుటుంబంతో సినిమాను చూడడం చాలా భయంగా వుంది కారణం నేటిమన చిత్రాలలో కనుపించే అసభ్య శృంగార దృశ్యాలు! అటువంటి దేమీ లేకుండా ఈ చిత్రాన్ని నిర్మించిన నిర్మాతలను అభినందిస్తున్నాను' అని, మాట్లాడిన మంత్రివర్యులు ప్రభుత్వ పరంగా అటువంటి దృశ్యాలను ప్రదర్శన కనుమతించిన సెన్సార్ బోర్డుపై ఎటువంటి చర్య తీసుకున్నారు? నిర్మాతల కమిటీ ముఖస్తుతికి ఏవో "కాకా కీతాలు' పలికేసి పోవడమేనా వీరి కర్తవ్యం? తమ అభిమాన నటుల ధ్యాసలో కొట్టు మిట్టాడుతూ సినిమా పరిశ్రమ, సంఘ శ్రేయస్సు విషయమై నిర్లక్ష్యతను చూపే అభిమాన సంఘాలేమంటారు? మితిమీరి అసభ్యంగా ప్రవర్తించే పిల్లలను తమ ఆజమాయిషీలో సత్ప్రవర్తనులుగా మలచని తల్లి దండ్రులను ఏమనాలి? వీరందరూ కారకులే!

ఈ నాటి సెక్సు విజృంభణను అరికట్టేందుకు సినిమాలను బాయ్‌కాట్ చేసి ముందు," మన ప్రేక్షకులపై (విద్యార్థులపై) చాంచల్యతను ప్రేరేపించే స్వదేశీ విదేశీ శృంగార చిత్రాలను నిషేధించి, చవుకబారు శృంగార పుస్తకాలను నిషేధించేందుకు ప్రభుత్వం, ప్రజా నాయకులు కృషి చేయాలి! విద్యార్థులు, అభిమాన సంఘాలు పైసమస్యలను వ్యతిరేకించి సభ్యతను కల్పించిన నాడే మనకూ మన చిత్రాలకు ఒక ప్రత్యేకత ఏర్పడుతుంది. పవిత్రమైన, ప్రజాహితమైన సత్సంప్రదాయతను, సంఘ భవిష్యత్తుకు మళ్ళీ పునాదులు బలం చేకూరతాయి. అటువంటి సంచలనం మనందరిలోను రావాలని ఆశిస్తున్నాను!!!

• * •



కాంచన వద్దనుండి బహుమతి సంపాకొంటున్న నాగేశ్వరరావు

## అక్కినేని-శారదలకు ప్రథమ బహుమతులు.

గోద్రేజ్ సోప్స్, ఆంధ్ర సచిత్ర వార పత్రికవారు నిర్వహించిన 'సెలెక్ట్ యువర్ ఫేవరేట్ స్టార్స్ కంటెస్ట్' లో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ఉత్తమనటునిగ, ఊర్వశి శారద ఉత్తమనటిగా ఎన్నికైనారు. శోభన్‌బాబు, చంద్రకళలు ఉత్తమ సహాయ నటీనటులుగాను రాజ్‌బాబు ఉత్తమ హాస్యనటునిగాను కె. వి. మహాదేవన్ ఉత్తమ సంగీత దర్శకునిగ వి మధుసూదనరావు ఉత్తమ దర్శకునిగ మనుషులుమారాలి ఉత్తమ చిత్రంగాను ఎన్నుకోవడం జరిగింది

విజేతలకు సినిమానటి కుమారి కాంచన బహుమతులను అందజేసింది.

ఈ పోటీలో పాల్గొన్న పాఠకులలో శ్రీయం. రఘునాథరావుకు మొదటి బహుమతి రెండువేల రూపాయలు. శ్రీ ఆర్ సురేష్‌కు రెండవ బహుమతి ఏడు వందల యాభై రూపాయాలు లభించాయి.

# ఏజంట్లు కావలెను

ఈ దిగువ ప్రాంతాలలో ధరావతు కట్టి తమ స్వంత బాధ్యతపై జ్యోతి మాసపత్రికను విక్రయించుటకు ఏజంట్లు కావాలి

1 కృష్ణాజిల్లా
హనుమాన్ జంక్షన్
నందిగామ
నూజివీడు
జగ్గయ్య పేట
పామర్రు
పెనమలూరు
ఆరుగొలను
కొండపల్లి
మావికొండ
గుడివాడ

2 చిత్తూరు జిల్లా
కాళహస్తి
బి. కొత్తకోట
కలికిరి
పీలేరు
పుంగనూరు
సత్యవేడు

3 కడపజిల్లా
పులివెందల

4 తూర్పుగోదావరి జిల్లా
అనపర్తి
గొల్లలమామిడాడ
రాజోలు
సామర్లకోట
మోరి
తాపేశ్వరం

5 పశ్చిమ గోదావరి జిల్లా
ఆకివీడు
కొవ్వూరు
నిడదవోలు
అరవల్లి
పోలవరం
గణపవరం
పెనుగొండ
గుండుగొలను

6 గుంటూరు జిల్లా
కొల్లూరు
చిలకలూరిపేట
పొన్నూరు
పెదనందిపాడు
మేదరమెట్ల
చిలువూరు
చేబ్రోలు
ఈమని
ఇంకొల్లు
కొల్లూరు
పెదకూరపాడు
టంగుటూరు

7 ఖమ్మం జిల్లా

భద్రాచలం

కొత్తగూడెం

చర్ల

మధిర

సత్తుపల్లి

8 కర్నూలు జిల్లా

కంభం

ఆదోని

ఆళ్ళగడ్డ

బంగనపల్లి

ధోన్

నందికొట్కూరు

9 కరీంనగర్ జిల్లా

హుజూరాబాద్

జగిత్యాల

పెదపల్లి

10 మెదక్

సిద్దిపేట

11 నల్గొండజిల్లా

కోదాడ

మిర్యాలగూడ

భోనగిరి

దేవరకొండ

12 నెల్లూరు జిల్లా

చిట్టగుంట

ఆల్లూరు

పొదలకూరు

బుచ్చిరెడ్డిపాలెం

కోట

నాయుడుపేట

13 నిజామాబాదు

షక్కర్‌నగర్

ఆర్మూరు

బాన్‌స్వాడ

బోధన్

వివరాలకు

సర్క్యులేషన్ మేనేజరు,

జ్యోతి

41-బి బర్కిట్ రోడ్డు

టి నగర్. మద్రాసు. 17



'చిట్టిచెల్లెలు'లో వాణిశ్రీ, రాజశ్రీ,

## శరవేగంతో నిర్మితమవుతున్న
## శ్రీ మాతా పిక్చర్స్‌వారి
## "పెద్దలుమారాలి"

మహిళల ఆధ్వర్యాన నిర్వహింపబడుతున్న ఒకేఒక చలనచిత్ర నిర్మాణసంస్థ శ్రీ మాతా పిక్చర్స్. వీరు చక్కని సంచలన చిత్రం "చిన్నారి పాపలు" నిర్మించి ఆంధ్ర ప్రజల, ప్రేక్షకుల విశేషాదరణను పొందారు. చిత్రపరిశ్రమలోనే చక్కని సరవడిని సృష్టించిన ఘనతను సాధించారు.

మరిప్పుడు తమ ద్వితీయ కానుకగా ఓ చక్కని ప్రబోధాత్మక చిత్రం "పెద్దలు మారాలి" నిర్మాణాన్ని ప్రముఖ దర్శకులు ఆదుర్తి అధ్వర్యాన శరవేగంతో సాగిస్తున్నారు.

ఈ చిత్రం షూటింగ్ రెండవ షెడ్యూలు మద్రాస్ శారదా స్టూడియోలో జూలై 16 న ప్రారంభమైంది.

ఈనా దర్శకులు తోట అతి సహజం

గానూ మరింత చక్కగానూ నిర్మించిన ఒక సామాన్యుడి ఇంటి సెట్‌లో పది హేనుమంది అధిక సంతానంతో సతమతమవుతున్న సార్థక నామధేయుడు సంతానం (రమణారెడ్డి) కుటుంబ సన్ని వేశ చిత్రీకరణతో యీ షెడ్యూలు ప్రారంభమైంది ప్రేక్షకుల హృదయాల్ని కరిగించి నవ్వుల జల్లుల్లో ఉక్కిరిబిక్కిరి చేసే ఈ కరుణామయ హాస్యపూరిత ఘట్టాల్లో రమణారెడ్డి మాడా వెంకటేశ్వరరావు నిర్మల లక్ష్మి కాంతమ్మ విజయలక్ష్మి అన్నారావు సంధ్యారాణి చాలామంది కళాకారులు పాల్గొన్నారు

ప్రసిద్ధ వర్ధమాన రచయిత్రి రామలక్ష్మి ఆరుద్ర రచించిన....

"కన్నీటిలోన రగిలింది జ్వాలా....." పాటను ప్రఖ్యాత నేపథ్యగాయకులు ఘంటసాల హృదయాల్ని ద్రవించేలా పాడగా విజయా స్టూడియోలో జూలై 16 న రికార్డింగ్ చేశారు.

గత ఉగాదినాడు విజయా గార్డెన్స్‌లో పాటల రికార్డింగ్ ఆరంభంకాగా, జూలై 6 న మద్రాస్ అవుట్‌డోర్‌లో షూటింగ్ ప్రారంభోత్సవం జరిగింది. ప్రసిద్ధనటులు పార్లమెంటు సభ్యులు జగ్గయ్య క్లాప్ కొట్టారు. ప్రముఖ తెలుగు చిత్ర దర్శకులు ఆదుర్తి సుబ్బారావు కెమెరా స్విచ్ ఆన్ చేశారు

షూటింగ్ తొలి షెడ్యూలులో "భయం భయంగా వుందమ్మా పట్టణమంతా . ఎంతో" పాటను అర్ధరాత్రివేళ మద్రాస్ వీధుల్లో మాస్టర్ అక్కినేనిపై చక్కగా చిత్రీకరించారు ఈ చిత్రంలో ఇదో హైలైట్‌గా భావింపబడుతోంది

మాయదారి లోకం తీరు ఓరయ్యో చూడు' నృత్యగీతికను నృత్య దర్శకులు హీరాలాల్ చక్కని నృత్యాల్ని సమకూర్చగా మద్రాస్ వీధుల సుందరతర దృశ్యాల మధ్య గీతాంజలి కుమారి పద్మినిలపై నేత్రపర్వంగా చిత్రీకరించారు

పది రోజులపాటు జరిగిన యీ షెడ్యూ



'ఇంటి గౌరవం'లో కే
జమునకుమారి, చంద్రమోహన్



'బొమ్మలాట'లో జయలలిత

...లతో దాదాపు సగం చిత్రం పూర్తయింది.

పిల్లల పెంపకంలో నేటి పెద్దలు అనుసరిస్తున్న పద్ధతుల్ని కళ్ళకు కట్టినట్లు ఎత్తిచూపి పిల్లల బంగారు భవిష్యత్తుకై పెద్దలే మారవలసిన కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ శ్రీమతులు ఆదుర్తి కామేశ్వరీబాల సరోజినీ మధుసూదనరావు గార్లు రచించిన ప్రబోధాత్మక ఇతివృత్తాన్ని సెల్యులాయిడ్‌పై చక్కగా మలచడానికి దర్శకులు పి. సి. రెడ్డి తీవ్రకృషి గావిస్తున్నారు.

తారాగణం :- జమున, మాస్టర్ అక్కినేని, కృష్ణ, నిర్మల, రమణారెడ్డి, గీతాంజలి, సి. హెచ్. కృష్ణమూర్తి, సంధ్యారాణి, మాడా వెంకటేశ్వరరావు, లక్ష్మీ కాంతమ్మ, కుమారి పద్మిని, డాక్టర్ శివరామకృష్ణయ్య, కుమారి సావిత్రి, మాస్టర్ ఆదినారాయణ, మాస్టర్ కె. వి. ఆర్. మూర్తి. అతిథినటులు :- గుమ్మడి, అంజలీదేవి, జగ్గయ్య, కృష్ణకుమారి

సాంకేతికవర్గం :- శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర, బి. గోపాలం, పి. లీల, వి. ఎస్. ఆర్. స్వామి, హీరాలాల్, తోట. కె. సత్యం; ప్రొడక్షన్ కంట్రోలర్స్: పి. వి. రమణయ్య, దండమూడి వెంకటేశ్వరరావు; సహాయ దర్శకులు: మన్నె రాధాకృష్ణ, డి. మధు, బాబు;

నిర్మాణ నిర్వహణ వి. సరోజినీ మధుసూదనరావు దర్శకుడు పి. సి. రెడ్డి, బి ఏ



మధు పిక్చర్స్

# ఇంటి గౌరవం

పి మల్లిఖార్జునరావు

"మంచికుటుంబం" వంటి
ఉత్తమ చిత్రాన్ని
అందించిన
పి మల్లిఖార్జునరావు
సమర్పించు
మరొక
విశిష్టకుటుంబచిత్రం

SUVARNA

నవయుగ



'అల్లుడే మేనల్లుడు'లో కృష్ణంరాజు, కృష్ణ.

లక్ష్మీ కళాచిత్రవారి తొలి సాంఘిక చిత్రం.

నిర్మాత శ్రీకోట్ల వెంకట్రామయ్య బి. ఏ. సుబ్బారావు దర్శకత్వంలో నిర్మిస్తున్న తమ తొలిసాంఘికచిత్రంలో ఎన్. టి. రామారావు, జగ్గయ్య, వాణిశ్రీ, అల్లురామలింగయ్య, రాజ్‌బాబు, సత్యనారాయణ, శాంతకుమారి మొదలైన వారిని నటీనటులుగా ఎన్నుకొన్నారు. సాలూరు హనుమంతరావు సంగీతం సమకూర్చుతున్నారు.

ఆగస్టునెలలో మూడు పాటలను జెమినీస్టుడియోలో రికార్డ్ చేయుటకు సన్నాహాలు చేస్తున్నారు. కథ, జి. బాలసుబ్రహ్మణ్యం. పూర్ణా విడుదల.

## విచిత్ర విలన్ శ్రీ నాగభూషణం

"అవును; మీరంతా అనుకుంటున్నట్లు ఆలోచిస్తున్నట్లు - నేను సినిమాల్లో విలన్‌ని చిత్రం చివరిలో కథానాయకుడి చేతిలో దావుదెబ్బలు తినే విలన్‌ని - ప్రేక్షకుల తిట్లు శాపనార్థాలూ - ఆగ్రహావేశాలకూ గురయ్యే గండు విలన్‌ని-కాని కాని మరిప్పుడు వధు పిక్చర్ వారి 'ఇంటి గౌరవం'లో మామూలు విలన్‌ని కాదు విచిత్రమైన విలన్‌ని అంద్రిని వింతపరచే విలన్‌ని నిజానికి నాకు నేనే విలన్‌ని అంటే - నేను పెంచి పోషించిన చెడును నా చేతుల్తోనే హతంచేసి నాకు నేనే కథానాయకుడినైన విలన్‌ని" అంటారు - ఇంటి గౌరవం చిత్రంలో - కిరాయి రౌడీ బాబూరావు పాత్రను అద్భుతంగా పోషించిన వెండితెర విలన్ శ్రీ నాగభూషణం

ఈ కొత్త తరహా విలన్ పాత్ర తన కెంతో నచ్చిందనీ తానెంతో మెచ్చినదనీ - అందుకే ఎంతో ప్రత్యేక శ్రద్ధతో నటించాననీ కూడా అంటారు శ్రీ నాగభూషణం

విలన్ పాత్రల పోషణలో ఆయనకు ఆయనే సాటి అయిన నాగభూషణం నటన ఈ చిత్రంలో మరో హైలైట్!

ప్రముఖ దర్శకులు శ్రీ బాపు దర్శకత్వంలో తయారవుతున్న ఈ చిత్రం ఆగస్టులో విడుదల కానున్నది నిర్మాత శ్రీ మల్లికార్జునరావు

## అల్లుడే మేనల్లుడు

పి. పుల్లయ్య దర్శకత్వంలో శరవేగంతో తయారవుతున్న పద్మశ్రీవారి 'అల్లుడే మేనల్లుడు' చిత్రం విశాలాంధ్ర అంతటా విడుదలయ్యేందుకు సిద్ధమవుతూంది

కృష్ణ నాగభూషణం సత్యనారాయణ కృష్ణంరాజు రాజ్‌బాబు అల్లు రామలింగయ్య ధూళిపాళ రావికొండలరావు కాకరాల నెల్లూరు కాంతారావు విజయనిర్మల కాంతకుమారి సూర్యకాంతం రమాప్రభ జ్యోతిలక్ష్మి లక్ష్మీకాంతమ్మ, బేబీ రాణి, బేబీ బ్రహ్మణి బేబీ సుధ మాస్టర్ ఆదినారాయణ మాస్టర్ సురేష్‌కుమార్ మాస్టర్ గరిమెళ్ళ విశ్వేశ్వరరావు నటిస్తున్న యీ చిత్రంలో సావిత్రి అతిథి నటి పూసల అనే హాస్య నటుని తొలిసారి పరిచయం చేయటం కూడా జరిగింది. నిర్మాత వి. వెంకటేశ్వర్లు బి. ఏ.

### బంగారు కుటుంబం

ఆగస్టులో విడుదలవుతున్నందుకు సిద్ధమవుతున్న చక్రపాణి నారాయణ చిత్రం బంగారు కుటుంబం శ్రీయుతలు కేశవేని ఉత్తరనారాయణ కేశవేని ప్రభాకరనాయుడు అధిక వ్యయంతో నిర్మిస్తున్న ఈ చిత్రంలో అంజలీదేవి రాజశ్రీ విజయనిర్మల ఛాయాదేవి పద్మ కృష్ణ రామకృష్ణ గుమ్మడి

ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య. నటీనటులు. దర్శకత్వం కె. యస్ ఆర్. దాస్. ఆంధ్రలో అపరాజిత, నైజాంలో శారదావారు విడుదల చేస్తారు ప్రెస్ రిలేషన్స్ శ్రీ కృష్ణ.

## బొమ్మలాట

ఎం. వి. ఆర్. మూవీస్‌వారి అత్యద్భుత హాస్య రసమయ సాంఘిక చిత్రం 'బొమ్మలాట' పూర్ణా పిక్చర్స్ డిస్ట్రిబ్యూటర్స్ ద్వారా విశాలాంధ్రలో త్వరలో విడుదల చేయుటకు సన్నాహాలు జరుగుతున్నాయి. మహాకవి శ్రీశ్రీ పాటలు. మాటలు వ్రాశారు ఇందర్‌జాన్ బాబు సంగీత దర్శకత్వంలో పి సుశీల. రమాదేవి. ఎల్ ఆర్. ఈశ్వరి. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం. బెంగుళూరు లత. విల్సన్‌లు పాడారు. జయలలిత. సచ్చు. మనోరమ, నాగేష్ జయశంకర్, సుందరరాజన్, ఓ. ఏ. కే దేవర్ నటిస్తున్న ఈ చిత్రానికి దర్శకులు వి శ్రీనివాస్, నిర్మాత ఎం. వెంకటరత్నం బి ఏ.

## నా దేశం

జయా పిక్చర్స్ 'నా దేశం' తిరిగి షెడ్యూలు ప్రకారం షూటింగ్ ప్రారంభమైంది ప్రబోధాత్మకమైన ఈ సాంఘిక చిత్రంలో ప్రముఖ తారాగణమంతా పాల్గొంటున్నారు. దర్శకత్వం కె. రాధాకృష్ణ. నిర్మాత: ఏ. మాధవరావు.

## మాధవి ఆర్ట్ ప్రొడక్షన్స్

## నెం. 1.

మాధవి ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి తొలి చిత్రం యిప్పటికి దాదాపు ఐదు రీళ్ళకు పైగా పూర్తయింది. శ్రీ ఘంటసాల సంగీత సారథ్యంలో రికార్డు చేసిన రెండు పాటలను శోభన్‌బాబు, ఎస్. వి. రంగారావులపై చక్రవర్తి సన్నివేశాలలో చిత్రీకరించుట జరిగింది. పి సాంబశివరావు దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంలో యింకా కాంచన, మాలతి. రావి కొండలరావు, గోపాలరావు. మాడా వెంకటేశ్వరరావు. బేబీ రాణి నటిస్తున్నారు. సహకార దర్శకులు జి. సి. శేఖర్. వి. సత్యనారాయణ రెడ్డి, నిర్మాత శ్రీ ఎ. యస్. ఆర్. ఆంజనేయులు.

## అనూరాధ

అనూరాధ ఆర్ట్‌పిక్చర్స్ 'అనూరాధ' చిత్రంలో నటసార్వభౌమ యస్. వి. రంగారావు ఒక చక్రవర్తి పాత్రకు జీవం పోస్తున్నారు. చిత్రానికింకా రంగారావు పాత్ర హైలైట్ అని స్పెషల్ చూపిన వారంటున్నారు.

యువ నిర్మాత శ్రీ యస్ వి. ప్రభాకర రెడ్డి నిర్మిస్తున్న ఈ సాంఘిక చిత్రంలో జి. వరలక్ష్మి. కృష్ణ. విజయనిర్మల. కృష్ణంరాజు. రాజశ్రీ. ప్రభాకర



బంగారు కుటుంబంలో గుమ్మడి-పాపలు

రెడ్డి, విజయలలిత, చంద్రమోహన్, జ్యోతిలక్ష్మి, రాజబాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య కె. వి. చలం, ఆనందమోహన్ మొదలగు వారు నటిస్తున్నారు. దర్శకత్వం పి. సి. రెడ్డి విడుదల శ్రీ లక్ష్మి ఫిలిమ్స్.

## సుందరకాండ

కాంతారావు, వాణిశ్రీలు ముఖ్య పాత్రధారులుగా, సౌత్ ఇండియా టాప్ ప్రొడ్యూసర్‌గా పేరు గడించిన శ్రీ శంకర్ రెడ్డి 'సుందర కాండ' పౌరాణిక చిత్రాన్ని నిర్మించేందుకు సన్నాహాలు చేస్తున్నారు.



శ్రీ స్వరాజ్యలక్ష్మీ ప్రొడక్షన్స్ ప్రొడక్షన్ నెం. 1లో
అంజలి, కాంతారావు, త్యాగరాజు, మాస్టర్ సుందర్.

## పార్వతీ విజయం

శ్రీ కన్యకాపరమేశ్వరి కథను "పార్వతీ విజయం"గా కన్నడం నుంచి తెలుగులోకి డబ్ చేసి, విడుదల చేస్తున్నారు. శ్రీ వెంకటరామా పిక్చర్స్‌వారు. గబ్బిట వెంకటరావు రచన చేస్తున్నారు

రాజ్‌కుమార్ కల్పన, విజయలలిత. రమాప్రభ పండరీబాయి రమాదేవి నాగేంద్రరావు మొదలైన వారు నటిస్తున్నారు. హంస్వారు కృష్ణమూర్తి దర్శకులు

## ఉత్తమ చిత్ర వారి ఉత్తమ సాంఘిక చిత్రం

శ్రీ కోగంటి కుటుంబరావు ఉత్తమ చిత్ర బ్యానర్‌లో నిర్మిస్తున్న ఉత్తమ సాంఘిక చిత్రం విశాలాంధ్ర అందటా త్వరలో విడుదలయేందుకు సిద్ధమవుతూంది.

జమున, నాగేశ్వరరావు నాయకి నాయకులుగా నటిస్తున్న ఈ చిత్రంలో జగ్గయ్య, పద్మనాభం రమణారెడ్డి చంద్రమోహన్, రామకృష్ణ, సూర్యకాంతం, అంజలీదేవి గీతాంజలి, అనిత మొదలైనవారున్నారు. సంగీతం పెండ్యాల. స్క్రీన్ ప్లే దర్శకత్వం ప్రత్యగాత్మ శ్రీ ఫిలింస్ విడుదల.

## శ్రీకృష్ణ విజయం

పద్మశ్రీ ఎన్, టి రామారావు మరో మారు శ్రీకృష్ణావతారంలో ఆంధ్ర ప్రజానీకాన్ని మైమరపింప జేయబోతున్న మహత్తర పౌరాణిక చిత్రం కౌముదీ పిక్చర్స్‌వారి "శ్రీకృష్ణ విజయం"లో జయలలిత, జమున, దేవిక కథానాయికలుగ నటిస్తున్న ఈ చిత్రంలో కాంతారావు అల్లు రామలింగయ్య, సంధ్యారాణి, ప్రఖ్యాత స్టేజ్ ఆర్టిస్ట్ సుమిత్ర, నటిక జయశ్రీ కనకదుర్గ, ప్రసన్నరాణి నటిస్తున్నారు శ్రీ కమలాకర కామేశ్వరరావు దర్శకులు సంగీతం పెండ్యాల. నిర్మాణం యస్, రెడ్డి.

## సంజీవిని ఫిలిమ్స్ రెండవ చిత్రం

'గండర గండడు' జానపద చిత్రం నిర్మించిన సంజీవిని ఫిలింస్ వారు తమ రెండవ చిత్రానికి సాంఘిక కథ ఎన్నుకొన్నారు ఇప్పటికి మూడు పాటలు రికార్డ్ చేయబడ్డాయి. సెప్టెంబర్ నెలలో షూటింగ్ ప్రారంభమై గండర గండడు వలెనే అనుకొన్న షెడ్యూల్సు ప్రకారం రెండు నెలల్లో చిత్రాన్ని పూర్తి చేయటానికిసన్నాహాలు జరుగుతున్నాయి. కాంతారావు కథానాయకునిగా నటిస్తున్న ఈ చిత్రానికి మాటలు కణ్వశ్రీ, పాటలు సి నారాయణ రెడ్డి దాశరధి, కొసరాజు. సంగీతం విజయా కృష్ణమూర్తి. ఆర్టు కళాకార్, సహదర్శకుడు చక్రవర్తి. దర్శకత్వం కె. యస్ ఆర్. దాస్ నిర్వహిస్తారు.